## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014997



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కథానిధి

గ్రంథకర్తలు:

తురుమెళ్ల వేంకటరావు,

మాచిరాజు సీతాపతిరావు.

ఓమ్

# నివేదన

నీతిబోధకములు ధైర్యసాహసికములు నానందదాయకములు నగు కథలయందు బాలురాసక్తులు. వానిని జదువునప్పు డనేకవిధమగు నుత్సాహమును సంతోషమును వారు ప్రకటింతురు. ఇది వారితోఁ బరిచయాధిక్యముగల యుపాధ్యాయులకు విదితము. ఉపాధ్యాయులమగు మేమీ "కథానిధి" నట్టి కథలతోఁ గూర్చినారము.

"కథాసుమాంజలి" యను నామముతో నిట్టిపుస్తకమే మేమిదివఱ కొక్కటి ప్రకటించినారము. అది యీవఱకే పాఠ్యపుస్తకనిర్ణయసంఘము (Text Book Committe) వారిచే నామోదింపఁబడి పెక్కుపాఠశాలలయందలి బాలురకత్యంతోపయోగకరముగ వెలయుచున్నది.

"కథానిధియు" నట్టి యామోదమునే బడసి యాదరింపఁబడుగాక యని కోరుచున్నాము. దయతో నీపుస్తకరచనకు మమ్ముఁ బ్రోత్సహించిన మాహైస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీమాన్ నందూరి రంగాచార్యులు ఎం. ఎ.,యల్.టి., గారికిని మామిత్రులగు శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారికిని మా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము. ఈకథలను పరిచూచి ప్రూఫులను సవరించి మాకు దోడ్పడిన శ్రీదాసరి లక్ష్మణస్వామిగారికిఁ గృతజ్ఞులము.

దీనిలోని చిత్రమును వ్రాసియిచ్చిన శ్రీమాన్ న॥ తిరు వెంకటాచార్యులుగారికి మానమస్కారములు.

గ్రంథకర్తలు.

# క థ లు.

# గానము.

## ౧

గ్రేసుదేశవాసియగు 'ఆర్ఫియస్' మహా ప్రఖ్యాతిఁ గాంచిన గాయకశిరోమణి, మహాకవి. అతఁడు సూర్యభగవానుని సుతుఁడని కొందరి యభిప్రాయము. కాని యాతఁడు పురాణకావ్యదేవతయగు 'కాలియోపీ' అనునామెకును, త్రేసుదేశ ప్రభువునకును జన్మించెనని సాధారణజనాభిప్రాయము.

'ఆర్ఫియస్' సంగీతవిద్యాప్రావీణ్య మపూర్వమైనది. ఆతని యసాధారణవీణావాద్యనిపుణతయు దానిలో లీనమగు శ్రావ్యమైన గాత్రధ్వనియు వినువారిని తన్మయులుగఁ జేయుచుండెను.

'ఆర్ఫియస్' వీణను చేతఁబూని తన మృదులాంగుళులచేఁ దంత్రుల మీటుచుఁ దనకు స్ఫురించిన మనోహరగీతములు, శ్రావ్యమధురకంఠమునఁ బాడుటకు మొదలిడినప్పుడు ప్రకృతియంతయుఁ జైతన్య మొందెడిది. ఆతని మోహనగానముచే భూమండలము పులకరించెను. మోడు మ్రాకులు చివుళ్లు లెత్తెను. వనాంతరములందలి మొగ్గలన్నియు విరిసి కలకల నవ్వెను. వేయేల? ఱాళ్లు అప్పలు గూడ నాట్యమాడెను. మఱియు నాతని మధురగానము ఘోరమైన తుపానులను గూడ శాంతింపఁ జేసెను, ఉప్పొంగి పొరలు భీకరాబ్ధిభం

గములను శమింపఁ జేసెను. మనుష్య హృదయమందలి చెడుతలంపులను దయార్ద్రములుగను, ప్రేమార్ద్రములుగను మార్చెను.

అతని మంజులగీతములకు సింహశార్దూలాది క్రూరమృగములు సైతము సాధువులై, సంగీతమాలింప నరుదెంచిన చానలతోను, బాలబాలికలతోను, స్నేహభావమున మెలంగుచుండెడివి. పక్షులీ గానసరణిని నేర్చుకొనుచుండెను. సెలయేళ్లు గలగలమని యానందముగఁ బాడుచుండెను. అతఁడు తన వీణాతంత్రులను మృదులముగ మీటుసరికి బ్రకృతియందలి సహజ గాయకు లందఱు నాతనితో నేకకంఠముగఁ బాడుచుందురు. ఎట్టివారికైన నేదైనఁ జెడుగు తటస్థించుచో వారలీతనిగానముచే నది వెంటనే నివారింపఁజేసికొను చుందురు. 'ఆర్గోనాట్సు' అనునాతఁడు సువర్ణకేశములఁ దెచ్చునప్పు డీతనిఁ దననౌకయందుఁ గూర్చుండఁబెట్టుకొనిపోయి పెక్కు కష్టముల బాఱినుండి తప్పించుకొనెను.

'ఆర్ఫియస్' ఇంతటి పరోపకారి యయ్యును దనకష్టముల మాత్రి తప్పించుకొనఁజాలకపోయెను. ము

౨

ప్రపంచములోనెల్ల గొప్పగాయకుఁ డని పేరు గాంచిన 'ఆర్ఫియస్'నకు మిగులఁ జక్కనిదగు భార్యయుండెను.

ఆమెపేరు 'యూరిడిస్'. ఆతఁ డామె నత్యంతముగఁ బ్రేమించెను. ఆతఁ డామె నొక్కక్షణమైన విడిచియుండుట కెంతయో కష్టపడెడువాఁడు. తా నామెచెంతలేనితఱి నామె కెద్దియేని యపాయము సంభవించునను భయ మాతనిమనసునఁ బొడము చుండెడిది.

ఆతఁడు వెఱచినట్లే తాను చెంతలేనిసమయమున నొక ప్పుఁ డామె కతిఘోరమగు నాపద వాటిల్లెను. ఒకనాఁటి సాయంకాల మామె పుష్పాపచయమునకై తన యుద్యానమున కేఁగెను. ఆ వసంతకాలపుష్పసముదాయ మామె కెంతయు నానంద మొసఁగెను. ఆమె వివిధకుసుమములఁ దనివిదీఱఁ గోసికొని యొక వృక్షచ్ఛాయ నధివసించెను. అమితముగఁ గోసికొనిన పూల నొకమాలగాఁ గ్రుచ్చి దానితోఁ దన దీర్ఘనీల ధమ్మిల్లము నలంకరింప నెంచెను. అంత నాసమీపమందున్న పొదరింట సుందరమగు నొక సుమము గానవచ్చుటచే సంతోషమున లేచి దానిం ద్రుంపఁ దన సుకుమారబాహులతను జాఁచెను. కాని యామె తుళ్ళిపడి తోడనే తనహస్తమును వెనుకకు లాఁగికొనెను. అంతలోఁ బచ్చికయందు దాఁగియున్న విషోరగ మొక్కటి యామెకాలిపైఁ గఱచెను. వెంటనే విష మామె శరీరము నావరించెను. ఆమె వివర్ణయాయెను. తత్క్షణము పాప మామె భూమిపైఁ బడి మరణించెను.

'ఆర్ఫియస్' కొంతవడి కరుదెంచెను. విచారవార్త

యాతనికిఁ దెలుపఁబడెను. ప్రేమఖనియగు హృదయేశ్వరి మరణించినందుల కాతఁడు విచారమునఁ గ్రుంగిపోయెను. మొదలునఱికిన మహావృక్షమువలె నవనిపైఁ బడెను. ప్రియసతీమణి లేని జీవనము నిరర్థక మని తలఁచెను. ప్రాణసఖిలేనిజీవితమును మోయలేక యామెవెంటఁ బరలోకమునకుఁబోవ నిశ్చయించుకొనెను. తోడనే పయన మయ్యెను.

నిజముగా నిది యొక భయోత్పాదక మగు ప్రయాణము. త్రోవలో నెన్నియో ఘోరదృశ్యము లతఁడు గాంచవలసి వచ్చెను. తనహృదయధనమును బోఁగొట్టుకొనిన 'ఆర్ఫియస్' మనోధైర్యమును మాత్రము వీడక యత్యంతోత్సాహమును బురికొల్పు తన మహతిని చేతఁ బూని తదేకధ్యానమునఁ బాడుకొనుచుఁ బోయెను. అతని యసాధారణగానమాధుర్యమున మార్గమందలి ఘోరకష్టముల నన్నిఁటిని గడచి సుఖలీలఁ బరలోకమున కేఁగెను. అచట శాశ్వతముగ యమయాతనల ననుభవించు జీవుల కాతఁడు తన గానామృతముచేఁ గొంతవఱకు సౌఖ్యమును గలుగఁ జేసెను.

చివర కాతఁడాలోకనాయకుని సన్నిధిఁజేరెను. ఆతఁడు మహావైభవముతోఁ బత్నీసమేతుఁడై సింహాసనము నధిష్ఠించియుండెను. 'ఆర్ఫియస్' తన ప్రియకాంతను దిరిగి భూలోకమునకుఁ దీసికొనిపోవుటకు సెల విమ్మని లోకనాయకు నతిదీన

ముగఁ బ్రార్థించెను. కాని లోకనాయకుఁ డతనిప్రార్థన నిరాక రించెను.

'ఆర్ఫియస్' నిరాశఁ జెందక ధైర్యముఁ దెచ్చుకొని తనవీణ నతిశ్రావ్యముగ వాయించుచు శ్రవణానందముగఁ బాడఁ దొడఁగెను. హృదయముతోఁబాటు దేహమునుఁగాల్చి నుసిచేయు తన మనోవేదన నొక్కసారి తన మృదుమధురకం ఠమునుండి దీనముగ వెలిబుచ్చెను. బ్రహ్మానందకరమగు నాతని గీతమాధురి పరలోకనాయకుని హృదయమును దయా ర్ద్రముగఁ జేసెను. ఆతఁడు 'ఆర్ఫియస్' రోదన మంతయు నాలించి కనికరించి తుదకు 'యూరిడిస్'ను దీసికొనిపోవుట కనుజ్ఞ నొసఁగెను.

## 3

'ఆర్ఫియస్' తనకుఁ దటస్థపడిన కష్టసముదాయముల నెన్నిఁటినో ధాఁటివచ్చినందులకును, రాజాంతఃపురమును తన గీతమాధురీ ప్రవాహములచే నింపినందులకును, ప్రత్యేక బహు మానముగ "నీసుందరిని నీకిచ్చివేసితి" నని లోకనాయకుఁ డనెను. కాని యాతఁ డొక యాన పెట్టెను. "నీవు నీప్రేయసిని భూలోకమునకుఁ గొనిపోవునప్పు డామెకొఱకై నీవు వెనుకకుఁ దిరిగిచూచితివేని తత్క్షణ మామె యామె మరల నీలోకమునకుఁ గొనిరాఁబడు" నని వచించెను.

'ఆర్ఫియన్' తనప్రేమనిలయమగు 'యూరిడిస్' ను మరల జేకొనఁ గలిగినందులకుఁ బ్రమోదాంతరంగుఁడై భావికాలసుఖములఁ దలఁచుకొనుచు భూలోకమునకుఁ బయన మయ్యెను. అత్యంతముదావహాయగు 'యూరిడిస్' యాతని ననుసరించి వెనువెంటఁ బోవుచుండెను. ఇప్పు డాతని విపంచికా తంత్రులనుండి వెల్వడు నాద మిదివఱ కెన్నఁడు నట్టి మాధురుల విరజిమ్మి యుండలేదు.

ఆతఁ డానందపరవశత్వమున భూలోకమునకుఁ జేరువగ వచ్చెను. ప్రియసతి తనవెంట నరుదెంచుచున్నదో లేదో చూడవలయు నని యాతఁ డాతురతఁ జెందెను. మన స్సాఁగి నదికాదు. పాప మాతఁడు పరలోకనాయకునియాజ్ఞ మఱచెను, వెంటనే వెనుకకుఁ దిరిగిచూచెను. తోడనే యాకస్మికముగ నెవరో యరుదెంచి యామె నాకాశమార్గమున లాఁగికొని పోయిరి.

'ఆర్ఫియస్' ఆఘోరకృత్యముఁ గాంచి గుండె బాదు కొనుచు 'అయ్యో! నాజీవధనమా! మందభాగ్యుఁడనగు నన్ను మరల విడనాడిపోవుచుంటివా? ఇఁక నాకేదిదిక్కు...? అని యనేకవిధముల విలపింప సాగెను. ప్రాణాధిక్యయగు ప్రియురాలివియోగము గానవిద్యావిశారదుండగు 'ఆర్ఫియస్' హృదయము వ్రయ్యలుజేసెను. అప్పటినుండియు వేఱొక

వనితముఖ మాతఁడు గాంచనని గొప్ప శపథముఁ గావించు కొనెను.

ఈ శపథ మీతనిఁ బ్రేమించి దగ్ధమనోరథలైన ఫ్రేసు దేశపుఁగన్యకల నెంతయో కోపనులుగఁ జేసెను. వారటు లాతనిపై గ్రోధము వహించియుండి యొకనాఁటి యుత్సవసందర్భమున నాతనిఁ జంపి ముక్కలు ముక్కలుగ ఖండించిరి. ఆతఁ డట్లు చంపఁబడునప్పుడుగూడఁ దన హృదయేశ్వరీనామ గానమె యొనరించుచుఁ బ్రాణముల విడచి పరలోకమున నున్న తన ప్రియురాలినిఁ గలసికొని ప్రేమగాన మొనరించుచు శాశ్వతసౌఖ్య మనుభవించెను.

---

# మైత్రి.

## ౧

'డామోన్' అనునాతఁడును, 'పైథియస్' అను నాతఁడును గొప్పవంశమునకుఁ జెందిన యువకులు. వారిరు వురుఁ బరస్పర మత్యంతముగఁ బ్రేమించుకొనిరి. నిజమైన స్నేహ మనిన వారిదే. పూజ్యమగు వారి సౌభ్రాత్రభావము జను లందఱిచేతను గొనియాడఁబడుచుండెను. వారిరువురలో నొక రిపై నింకొకరికిఁ గల విశ్వాసమునకు మేర లేదు. అవనమ్మ కపుటుద్దేశ్యమునకు వారి హృదయములలో నించుకైనఁ దావు లేదు. ఎట్టి కష్టావస్థలయందైన వారి పవిత్రమైన మైత్రి కణు మాత్రమేని లోటు గలుగలేదు.

'సిసిలీ' దేశపురాజు 'డయనీసియస్' మిక్కిలి క్రూరకర్ముఁడు. మొదట నాతఁడు కడు బీదస్థితియందుండెను. బాల్యమునుండియు నాతఁ డెందరి యుద్యోగులతో లొంగి యుండెను. ఎందరి యాజ్ఞలకో వినమ్రతతోఁ దలయొగ్గి యుండెను. కాని యాతఁ డెట్టికార్యమందును మహోద్భుత మగు పట్టుదలఁ గలిగి యుండెడివాఁడు. ఉన్నతస్థాన మాక్ర మింపవలయునను తీక్ష్ణమైన యాశయే యాతని నీరాజ్యమును సంపాదింపఁ జేసెను. స్వీయదేశమున నాతని కున్న యధికార

మునకు మితిలేదు. ఆతని నిరంకుశాధికారమువలన నతని ప్రజలును, విరోధులును, పెక్కు బాధల ననుభవించిరి.

ఇట్లుండఁ గొన్ని దినములకు 'పైథియాస్' పై నన్యాయముగ రాజద్రోహపునేర మొకటి యారోపింపఁబడి యాతనికి 'డయనీసియస్' చే మరణదండన విధింపఁబడెను.

పాప మెఱుఁగని 'పైథియస్' న కీదండన భయంకరముగఁ దోఁచెను. అతఁడు రాజున కొకమనవిఁ జేసికొనియెను. చాలఁ దొందరగఁ బరిష్కరింపఁబడవలసిన ముఖ్యమగు గృహ విషయములు కొన్ని తనకుఁ గలిగియున్న వనియు, నిరపరాధియైన తన్నుఁ జంపుటకు ముందుగాఁ దన పట్టణమున కొకసారి తాను పోయివచ్చుటకు సెలవీయవలయుననియు, వేఁడుకొనెను.

అచటనున్న ప్రజలందఱు దయాంతరంగులై యాతని యాచిన్నప్రార్థన నంగీకరింపు మని రాజును బతిమాలుకొనిరి.

ఎట్టకేలకుఁ గఠినహృదయుఁడగు నారాజొకనిబంధనపై నాతఁ డింటికిఁ బోయివచ్చుట కనుజ్ఞ యిచ్చెను.

అతఁడు తిరిగి వచ్చుదనుక నతనికి బదులుగా నింకొక మనుష్యుని గారాగృహమునం దుంచవలయుననియు, నిర్ణీతకాలములో నాతఁడు తిరిగి రానియెడల నా బూఁటకాఁపు తప్పక వధింపఁబడగలఁ డనియు, వచించెను.

'పైథియాస్' నకుఁ దత్క్షణమె 'డామొన్' స్ఫురణకు వచ్చెను. ఇట్టి నికృష్టతరుణమున సాయ మొనర్చువాఁడే నిజ

మైన స్నేహితుఁడు. నా ప్రాణమిత్రుఁడగు 'డామోన్' ఎన్న టికిని నావిషయమై యెట్టిపనిఁ జేయుటకైన వెనుదీయఁడని నా దృఢనమ్మకము. కావున నే నిప్పుడే యాతని కొఱకై వర్తమాన మంపించెద నని నిశ్చయించుకొని వెంటనే యీవృత్తాంత మంతయు 'డామోన్'నకుఁ దెలియఁ జేసెను.

'పైథియాస్' కార్య మెట్టిదైన నొనరింప 'డామోన్' వెనుదీయువాఁడు కాఁడు. అతఁ డీవార్త వినినతత్క్షణ మొకనిము షమైన జాగుసేయక 'డయనీసియస్' సభకుఁ బరుగెత్తుకొనుచు వచ్చెను. ముందు తనకు రానున్న యాపద నాతఁ డొంతమాత్రము లెక్కసేయక సంతోషపూర్వకముగఁ దనమిత్రునికొఱకై దాను చెఱలో నుందునని ప్రకటించెను. రా జాతని సాహసమున కెం తయు నాశ్చర్య మొందెను. పిమ్మట 'పైథియాస్' రాజాజ్ఞపైఁ దనయింటికిఁ బోయెను. పాపము 'డామోన్' దుర్మార్గుఁడైన రాజుయొక్క కారాగారము నందుండి పెక్కు కష్టములకు లోన గుచుండెను.

౨

ఒకదినమున 'డయనీసియస్' కారాగృహముచెంత కరు దెంచి 'డామోన్'తో నిట్లనెను.

ఓయీ! నీ వొసఁగిన యీయవకాశము ననుసరించి 'పైథియాస్' నిర్ణీతకాలములోఁ దిరిగిరానియెడల నీవు నిశ్చ

యోమముగ మరణము చేకూర్పఁబడును. అందువిషయమై నీకే మియు భయములేదా ? అని యడిగెను.

నే నావంతయు భయపడ నవసరము లేదు. నామిత్రుఁడు సరియైనకాలములోఁ దప్పక తిరిగివచ్చునను సంపూర్ణవిశ్వాసము నాకుఁ గలదు. ఏదైన మృత్యువుగాని, నిర్బంధముగాని, యాతని నాఁపవలయునేగాని వేఱొండుకారణములచే నతఁ డాఁగువాఁడు కాఁడు. అయినను నాప్రాణ హితుఁడగు 'పైథియాస్' యెవ రిచేనైన నిర్బంధితుఁడు గావలయుననియే నాకోరిక. ఆతనికొఱకై చచ్చుటకంటె నాకు వేఱొం డదృష్టముకలదా? అని 'డామొన్' చిఱునగవుతో ననెను.

స్నేహితుఁ డన నెట్టివాఁడో, స్నేహ మన నెట్టిదియో యెఱుఁగని రాజునకు 'డామొన్' తనమిత్రునిపైఁ గనఁబఱచు భక్తివిశ్వాసములు మహాద్భుతములుగఁ దోఁచెను. రాజా బం ధితుని ధైర్యస్థైర్యములకును, విశేషముగ నతని ప్రేమోన్నతి కిని మెచ్చుకొనెను కాని నిర్ణీతసమయమునకు 'పైథియాస్' రానిపక్షమున నీతని సమయించుటకు దృఢముగ సంకల్పించు కొనెను.

రాజుచే నక్రమముగఁ దనపై విధింపఁబడిన మరణదండన నెట్లైనఁ దప్పించుకొనవలయు ననెడియూహ 'పైథియాస్'న కిసుమంతయు లేదు. తనప్రియస్నేహితున కన్యాయ మొన రించుతలం పసలెలేదు. కాని విధివశమునఁ గొన్ని విపరీతసంఘ

టన లడ్డువచ్చుటచే నతని ప్రయాణమున కొక్కింత యవరోధము తటస్థించినది.

ఎట్టకేల కాతఁ డెట్లో పయనమై వచ్చుచుండఁ ద్రోవలో మరల నొక యాటంకము గలిగినది. ఆతఁ డది తప్పించుకొని పరుగుపరుగున వచ్చుచుండ మరల నింకొక నిరోధ మేర్పడెను. పాప మాతఁ డప్పు డొకింత యధైర్య మొందెను. కాని తోడనే ధైర్యముఁ దెచ్చుకొని మనుష్యాతీతమగు ప్రయత్నముఁ గావించి తక్కిన స్వల్పదూరమును నిరాటంకముగా వాయువేగమునఁ బరుగెత్తుకొనుచు వచ్చెను. కాని పాప మాతని హృదయము పరితాపముచే వ్రయ్యలు కాఁజొచ్చెను. క్రూరాత్ముఁడగు జనపాలుని నిలయమున కాలస్యముగఁ జేరెదనేమో యని యాతఁ డత్యంత భయాకులుఁ డగుచుండెను.

ఇంతలో నియమితకాల మాసన్న మాయెను. కటిలుఁడైన 'డయనీసియస్' తత్క్షణ మురికంబముల సిద్ధపఱుపవలసినదని యుత్తరవొసఁగెను. 'డామొన్'ను తప్పక బలియీయ నాతఁడు స్థిరసంకల్పుఁడయి యుండెను. 'డామొన్' నిర్బంధింపఁబడిన కారాగృహముకడ కాతఁ డేఁగి "ఓయీ! నీమిత్రునిపై నీకుఁ గల వెఱ్ఱినమ్మకమునకు నే నెంతయు జాలిపడుచుంటి" నని పలుకుచుఁ గపటప్రేమతో మొసలికన్నీళ్లను విడచెను.

అందులకు 'డామొన్' పెదవులనుండి చిఱునవ్వు వెలువడెను. తరుణము మించిపోవుచున్నదని యాతఁ డెఱుఁగును

కాని తన ప్రాణసఖుఁ డనుకొనినమాటను దప్పఁడను సంపూర్ణ విశ్వాస మాతనికిఁ గలదు. పిమ్మటఁ గొంతతడవున కాతఁ డురి కంబములయొద్దకుఁ దీసికొని పోఁబడెను. అయిన నతఁ డతిశాం తముగనే యుండెను.

## 3

ఆ విచిత్రముఁ జూడవచ్చిన జనసమూహముయొక్క కోలాహల మెక్కువగా నుండెను. 'డామొన్' ఉరికంబములపై కెక్కింపఁబడెను. త్రాళ్లు మొదలగు పరికరము లన్నియు సిద్ధము చేయఁబడెను. ఉరిఁదీయుటకు రాజాజ్ఞ యైనది. భటు లాతని కంఠమున నురిత్రాడు దగిలింప సిద్ధపడుచుండిరి. అంతలో జన సమూహములోనుండి కనికరము సూచించు కేకలు బయలు వెడలినవి. కొందరి దృష్టి వెనుకకు మఱలినది. ఒకవ్యక్తి దూర మునుండి రోజుకొనుచు నత్యంత వేగముగ నామైదానమువైపు బరుగెత్తుకొని వచ్చుచుండెను. జనులకలకలము మఱింత హెచ్చెను. ఆనందధ్వనులు మిన్నుముట్టెను. ఊపిరి నైనఁ బీల్చ లేని యవస్థతో నలసిపోయిన శరీరావయవములతో నా జనసమ్మర్ద ములోనుండి 'పైథియాస్' హుటాహుటి నరుదెంచి పీఠముపై నెక్కి తనప్రియమిత్రుఁడగు 'డామొన్'ను గట్టిగాఁ గౌఁగిలించు కొనెను. దయామయుఁడైన పరమేశ్వరుని కృపావిశేషముననే యిపుడిచటికి రాఁగలిగితినని పెద్దపెట్టున నాతఁ డేడ్చెను.

అత్యంతాశ్చర్యజనకమగు వారల విశ్వాస భావమును, అతిపవిత్రమగు వారి ప్రేమానుబంధమును, వజ్రకాఠిన్యహృదయుఁడగు 'డయనీసియస్' నకుఁగూడ వింతఁ గొలిపినవి. దృఢాలింగన మొనరించుకొని తన్మయత్వముననున్న మిత్రద్వయమునుఁ గాంచి ప్రేక్షకు లందఱుఁ గన్నుల నానందబాష్పముల రాల్చిరి.

రాజు వారిరువురను సమీపించి 'పైథియా' సొనరించిన రాజద్రోహము క్షమింపఁబడెననియు, మరణదండన రద్దుపఱుపఁబడెననియుఁ బ్రకటించెను. మఱియు వారల పవిత్రప్రేమబంధములోనికిఁ దన్నుఁగూడఁ దీసికొనుఁడని వారల నిరువురఁ నతిదీనముగ వేఁడుకొనెను.

ఆహా! వారల యనోన్యమైత్రి యిటు లాకూ్రరజన పాలుని జయించినది.

ప్రపంచమున సజ్జనమైత్రినిఁ బోలువస్తు వింకొకటి లేదుగదా?

# నిష్ఠ.

## ౧

భూలోకమున బదరికావనమను మహావనము గలదు. కురుపాండవయుద్ధమున నిస్సహాయుఁడైన దుర్యోధనుని బ్రాణమునుండి వెల్వడఁ జేసి యతనిపై భీమసేనుని గదాయుద్ధమునకు శ్రీకృష్ణప్రభృతులు పురికొల్పఁగా నపుడచ్చటికి బలభద్రుఁ డరుదెంచి యాసమరము తెఱఁగుఁ జూడఁజాలక తీర్థయాత్రలు సలిపెను. ఆసమయమున నాతఁడు బదరికావనక్షేత్రమును గూడ దర్శించి ధన్యుఁడయ్యెను. ఆతీర్థరాజము సర్వాఘనాశనకరమై ముల్లోకములఁ బ్రసిద్ధిఁ జెందినది.

సప్తమహర్షులలో భరద్వాజుఁడొక మునిశ్రేష్ఠుఁడు. ఆతనికి బ్రభావతి యను నొక కొమార్తె కలదు. ఆమగువ ముఖలక్షణము లామె సార్థకనామధేయగా నెఱిఁగించుచుండును. ఆలలితాంగియవయవములు మృదువులై లావణ్య ముట్టిపడఁ జేయుచుండును. ఆమె తరుణవయస్క యయ్యెను.

ఆతరుణి తనరూపలావణ్యగుణములకుఁ దగినవరుని గోరుకొనెను. త్రిలోకాధినాథుఁడగు మహేంద్రుని పాణి నా శుకవాణి గ్రహింప నెంచెను. ఇంద్రలోకమున బంగారుమేడలలో

హంసతూలికా శయనమున నిష్టావినోదార్థియగు నిందురిని, అత్యంతానందదాయకమగు నందనోద్యానవనవిహారుఁ డగు నింద్రుని, బదరికావనదర్శనోత్సాహునిగఁ జేయ నెంచెను.

ఆమె హృదయ మతి నిర్మలము. ఆమెప్రేమ నిష్కళంకము. ఆమెభక్తి యమోఘము. మఘవుఁడే తనకు ధవుఁడు గావలయు నను నేకదీక్షతో నాపద్రిభావతి ఘోరమైన తపస్సు చేయ మొదలిడెను.

కొంతకాలమునకు వాసవుఁ డా భాసురాంగి తప మాచరించు బదరికావనమున కరుదెంచి తనరూపమును మఱుఁగు పఱచి వసిష్ఠునాకృతిఁ దాల్చి యామె కెదురుగఁ బోయి నిలుచుండెను. అంత సుగుణగరిష్ఠయగు నాపద్రిభావతి యమ్మహానామహర్షి నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి దండప్రణామంబు లాచరించి వినమితోత్తమాంగయై యిట్లని విన్నవించెను.

“ ఓఋషిసత్తమా ! భవద్దర్శనంబున నే నెంతయుఁ గృతార్థురాల నయితిని. అమరలోకవిభుని విభునిఁగాఁ బడయఁ గోరి నిట్లు తప మొనరించు చుంటిని. నాహృదయ మిది వఱకే యింద్రునివిశ్వేరుని కర్పింపఁ బడినది. కావున నాతనిఁ దక్క వేఱొకనిఁ బరిగ్రహింపనని నా నిశ్చితము. నేను పూనిన యిక్కార్యమున కెట్టి విఘ్నములు సంప్రాప్తించినను నాపూనిక వీడుదానను గాను. తా మిప్పుడు న న్ననుగ్రహింప నేతెంచినకారణ మేమియో వచింప వేఁడుకొనుచుంటి ” ననెను.

ఋషి దరహాసవదనుఁడై "ఓయతివా! నీదీక్షకు నే నెంతయు సంతసించితిని. ఇవిగో కొన్ని బదరీఫలములు నీకిచ్చు చుంటిని. వీనిని నీవు బాగుగా పాక మొనరించి నాకొసఁగుము" అని కొన్ని రేఁగుబండ్లామె కిచ్చెను.

౨

ప్రభావతి వానిని పుచ్చుకొని యాశ్రమములోనికిఁ బోయి పరిశుభ్రజలముల స్నానం బాచరించి ధౌతవస్త్రముల ధరించి ప్రొయ్యియం దగ్నినివేసి రాఁజఁబెట్టి జలముతోఁగూడ నా రేఁగుబండ్ల నొక పాత్రలో వైచి యాపాత్రను ప్రొయ్యిపై నుంచి పచన మొనరింప మొదలువెట్టెను. కాని యెంతసేపటికి నాపండ్లుడుకవయ్యెను. ప్రభావతి మొదటఁ గొనితెచ్చిన కాష్ఠముల నన్నింటిని ప్రొయ్యియం దుంచెను. మంటలు మండి కట్టె లన్నియుఁ గాలిపోవుటయేగాని ఫలము లించుకైనఁ బక్వమునకు వచ్చుటలేదు. దగ్గఱనున్న కఱ్ఱ లన్నియుఁ గ్రమముగ నయిపోయినవి. మరల నామె కొన్ని వంటకట్టెలఁ దెచ్చి యగ్నిని బ్రజ్వరిల్లజేయ నెంచెను. కాని యామె కాష్ఠములఁ దెచ్చునంతలోఁ బ్రొయ్యిలోనున్నయగ్ని యాఱిపోవునను భయ మామెకుఁ గలిగెను. అగ్ని సమసినయెడలఁ బాకము చెడిపోవు ననియు నుడుకని ఫలముల ఋషీశ్వరున కొసఁగుట మిక్కిలి పాప మనియు నామె పలుతెఱఁగుల నాలోచించి పొయ్యిని విడిచి

యరుగుట సమంజసము గాదని తుదకు నిశ్చయించుకొని యతు లప్రభావ యుతయగు నాప్రభావతి యింధనములకు బదులుగఁ దన కాలొకటి ప్రొయ్యియందుఁ జొనిపి యగ్నిని బ్రజ్వలింపఁ జేయు చుండెను.

వసిష్ఠరూపుఁడగు పాకశాసనున కీదృశ్య మత్యంతాశ్చ ర్యజనక మాయెను. తత్క్షణమే యాతఁడు నిజరూపమును గైకొని "ఓలతాంగీ! నీనిష్ఠాతిశయమునకు నే నెంతయు సంత సించితిని. నీమహిమ యనిర్వచనీయము. నీయభిమతము నెఱ వేఱుఁగాక! నీవీతనువును బరిత్యజించి మర్త్యలోకమును విడ నాడి యమరలోకమున కరుదె"మ్మని పలికెను. "మఱియు నీ బదరికావనప్రదేశము సకలపాపనాశనకరమై, ముక్తిదాయ కమై, ముల్లోకముల నత్యంత విఖ్యాతిఁగాంచు తీర్థరాజమగుఁ గాక!" యని వచించెను.

శుభాంగియు, మహాభాగయు నగు ప్రభావతీసతి త్రిదిన మ్మున కరిగి యమరనాయకుండగు మహేంద్రున కనుంగు సఖి యై సుఖం బుండెను.

ప్రభావతినిష్ఠాగరిష్ఠత కొనియాడఁ దగినది.

# స్వయంకృతాపరాధము.

## ౧

మనహిందూదేశమునకుఁ బశ్చిమమునఁ జాలదూరమున 'ట్రాయ్' అను గొప్పపట్టణ ముండెడిది. అది ప్రస్తుతకాలమునందలి చిన్నయాసియాలో నొకచోట నుండియుండవచ్చును. ఆప్రాంతము మిక్కిలి ధనవంతమైనది. 'ట్రాయ్' నగరనిర్మాణమునకుఁ బూర్వమైదు గొప్పపట్టణము లచట నొకటొకటిగా నిర్మింపఁబడి కాలక్రమమున నాశనము నొందినవి. 'ట్రాయ్' నగరప్రాముఖ్యత వానిని విస్మృతి నొందఁజేసెను. 'ట్రాయ్' పట్టణమునకుఁగూడ నంత్యదశ రాకపోలేదు. గ్రీసుదేశమునఁ బేరెన్నికఁగన్న వీరశిఖామణులైన రాజులందఱేకమై యీ పట్టణమును విధ్వంసమొనరించిరి. ఇది నాశనమగుటకు ముందు కొన్ని ఘనకార్యము లిచట జరుగుటచేఁగాఁబోలు దీనిపేరుమాత్రము తరతరముల నిల్చియున్నది.

'ట్రాయ్' మిక్కిలిబలమైన కట్టడములుగలిగి సుందరమైన నగరమై యొప్పుచుండెను. అందలి గోపురములు, మేడలు, రాజభవనములు, కోటలు వర్ణనాతీతములై యుండెను. వీధులు పగలంతయు నెడతెఱపిలేక ప్రజలతో నిండియుండెను. బాటసారులు, వర్తకులు, నగరద్వారముగుండ నెల్లప్పుడు లోనికి

బయటికి వచ్చుచుఁ బోవుచుండిరి. ప్రక్కనుండి సన్నని సము ద్రిపువాయువులు నగరమువైపు వీచుచుండెను. సూర్యుఁడు తన సహస్రకిరణములఁ బ్రకాశముగ వెదజల్లుచుండెను. నందన వనమున కెనయగు పూలఁదోట లెల్లెడల శోభిల్లుచుండెను. నగ రవాసు లందఱు నత్యుత్సాహముతోను నత్యానందముతోను కాలముఁ గడపిరి. ఇట్టి పట్టణము నామమాత్రావశిష్ట మగు నని నగరవాసు లెన్నఁడును గలనైనఁ దలంచియుండలేదు.

'ప్రీయమ్' అనునాతఁ డాపట్టణమునకు రాజు. తన ప్రజలయానందమునఁ బాల్గొనుచుఁ దాను నానందాబ్ధిని మునిఁ గితేలుచుండెను. అతఁడు తన భార్యయగు 'హెక్యూబ'యొక్క సౌందర్యమునకును, దన కుమారుల భుజబల సంపదకును, నగర వాసుల సత్ప్రవర్తనకును మిక్కిలి సంతసించుచుండెడివాఁడు. మఱియు నీరాజదంపతులు తమ కింకొక సుపుత్త్రుఁ డుదయిం పఁగలఁడను కోరికతో నుండిరి.

ఒకనాఁటిరాత్రి రాణి యొకవింతకలఁ గనెను. కలలోఁ దాను ప్రసవించినది. జన్మించినశిశువు మానవుఁడుగాక ధగధగ మెఱయుచు నిప్పును గ్రక్కుచు మంటలుమండుచున్న యొక కొఱవి యయ్యెను. ఆకొఱవి వెంటనే 'ట్రాయ్' నగరము నంతయుఁ బరశురామప్రీతిఁ జేయుచుండెను. భయసంభ్రమ ములతో రాణి మేల్కాంచినది. తన నాథున కీ దుస్స్వప్న మెఱింగించినది.

కలలోని సంగతు లెల్లప్పు డామె కన్నులఁగట్టినట్లుండెను. ఆమెమాత్రము తమ కెద్దియేని యొక ముప్పు వాటిల్లనై యున్నదని గ్రహించెను. అప్పటినుండియు నామె యెట్టి యపాయము రాకుండఁ దప్పించుకొనఁగలుగు మార్గముఁ జూచుచునే యుండెను.

కతిపయమాసముల కామె కొక చక్కని కుమారుఁ డుదయించెను. పుత్త్రిజననమున కామె సంతసించుటకు బదులు మిక్కిలి ఖిన్నురా లయ్యెను. తా నదివఱలోఁ గాంచిన కల తన యూహాపథమునుండి తొలఁగిపోలేదు. తమకుఁ జన్మించిన శిశువు జీవించునెడలఁ దమ నగరమునకుఁ దప్పక ముప్పు వాటిల్లఁగలదని యామె రాజుతో ననెను.

"నీపుత్త్రుని నీవే యంత మొనరించెదవా" యని రాజామెను ప్రశ్నించెను. చంపుట కామె యొప్పుకొనలేదు. కడుపాఱఁ గాంచిన కుమారు నెవరైనఁ జంపుకొనెదరా? రాణియగు నామెకుఁ గన్నకుమారుని మరణముకంటె స్వప్రజల వినాశనమే ఘోరముగఁ దోచెను. అందువలన వానిని సమీప పర్వతప్రాంతమునకుఁ గొనిపోయి యా వనమధ్యమందు విడిచిపుచ్చినచో బాగుగ నుండుననియు వాఁడు జీవించియుండుటకు భగవంతున కనుగ్రహము గలిగినచో నాతఁడే వానిని సంరక్షింపఁ గలఁడనియు వాఁడు మనకు నిజముగ హాని యొనర్చువాఁ

డయ్యేనేని వాని నీవిధముగఁ దప్పించుకొనినవార మగుదు మనియు నామె పల్కెను.

వారాప్రకార మూహించి వెంటనే యా శిశువును సమీపముననున్న కొండచరియలకుఁ గొనిపోయి దిగవిడిచిరి. చక్రవర్తికుమారుఁ డడవిపా లయ్యెను. అడవిమృగము లాబిడ్డ కేహానియుఁ గలుగఁజేయలేదు. దైవవశమున వర్షము కురియ లేదు. కాని చలిగాలి యాశిశువును నిద్రనుండి మేల్కొలిపెను. మేల్కాంచిన యాబిడ్డఁడు బిగ్గరగ నేడ్వసాగెను. ఆకలి యాపసి పాప యుదరము దహింపఁజేసెను. ఏడ్చినకొలఁది దాహమె క్కుడు కాఁజొచ్చెను.

పర్వతము క్రిందిభాగమునఁ గొందఱు గొల్లలకాఁపురులు నివసించుచుండిరి. వా రాపిల్లవానియేడ్పును విని వారి గొఱ్ఱె పిల్లలలో నొకటి బెదరి యఱచుచున్నదేమోయని యూహించి తొందరగా నా వైపునకుఁ జనిరి. వా రచట నాపిల్లవానినిఁ గాంచి యత్యంతాశ్చర్యమునుఁ బొందిరి. వారిలో సహజ కరుణార్ద్రహృదయుఁ డగునొకఁ డా పసివానిని లేవఁదీసి ముద్దాడి సురక్షితముగ నింటికిఁ గొనిపోయి తనభార్య కిచ్చెను. ఆమెయు భర్తగ్రహించి తెచ్చియిచ్చిన పిల్లవాని నత్యంతప్రేమతోఁ బెంచుచుండెను.

౨

రాజకుమారుఁ డా గొల్లవారింటఁ బెరిగి పెద్దవాఁడగు చుండెను. వా రతనికి 'ప్యారిస్' అను నామ మిడిరి. తన పూర్వచరిత్ర యించుకైనను దనకుఁ దెలియనికారణమున 'ప్యారిస్' కూడఁ దక్కిన గొల్లవారివలెనే మిగులఁ గష్టపడి పనిఁ జేసి జీవన మతిసౌఖ్యప్రదముగఁ గడపుచుండెను. 'ప్యారిస్' ఎండకును గాలికిని లక్ష్యపెట్టక దినమంతయు నాకొండప్రాంతములందు దిరుగుచుండెడివాఁడు. రాత్రియంతయుఁ జలిగాలిలో నిద్రించుచుండెడివాఁడు. ఆతనికిఁ గావలసిన సర్వమును బ్రకృతి నుండి గ్రహించుచుండుటచేతఁ గాఁబోలు నాతఁడు శీఘ్రముగఁ జక్కని శరీరసౌష్ఠవముఁ గలవాఁ డయ్యెను. ఆజానుబాహుఁడై యసమానమైన భుజబలమును సంపాదించెను. ప్రతివానిదృష్టికి నాకర్షణీయమగు సుందరమైన యవయవస్ఫూర్తిచే నాతఁ డొప్పుచుండెను.

ఆతని సహజసౌందర్యమునుఁ గాంచి దేవతలుఁగూడ నాతనియెడ నసూయఁ గలిగియుండిరి. 'హీరా' 'అథీనా' 'ఆఫ్రొడైట్' అను ముగ్గురుదేవకన్య లతని నెట్లయినఁ గష్ట పెట్టఁదలఁచి యాతనిదరి కేఁగి తమముగ్గురిలో నెవ తెయెక్కువ యందకత్తెయో తెలియఁబల్కుమని యాతనిని నిర్బంధించిరి. ఆతఁ డెన్నుకొనినయామె కతఁ డొక బంగారురేఁగుఁబండు బహుమతిగా నీయవలయునని యేర్పఱచిరి.

సాధారణపు గొల్లపిల్లవాని కది సాధ్యమగు పనికాదు.

ఆముగ్గురుయువతులు నొకరినిమించినసౌందర్య మింకొకరు గలిగి యుండిరి.

స్వర్గమునకు రాణియగు 'హీరా' మిక్కిలి సౌందర్య వతి. ఆమెరథమునులాగునవి మయూరములు. ఆకాశపథమున నాబ్రాహ్మణము లామెరథమును దీసికొనివచ్చునపు డామెసుందర వదనము మేలిముసుఁగులోనుండి తళతళ లాడుచుండెను. ఆనాఁ డామె యాభరణముల నైన నలంకరించుకొని యుండలేదు. వస్త్ర ములుగూడ సరియైనవి ధరించియుండలేదు. ఏదియెటులున్న నామె సహజసౌందర్య మామెమహారాజ్ఞిత్వమును చాటుచుండెను.

గ్రీకులలొ 'నథీనా' దేవత "కాటుకకండ్లయథీనా" యని వన్నెకెక్కినది. అట్టి యథీనా ప్యారిస్‌నకు మనోహర ముగ గోచర మాయెను. ఆమెగంభీరమగు వీక్షణముల శాంత తకును, చల్లఁదనమునకును నాతఁ డచ్చెరు వందెను. ఆమెయే మిక్కిలి సౌందర్యవతియని యతఁ డూహించెను.

పిమ్మట ప్యారిస్, 'అఫ్రొడైట్' వైపు తిరిగి చూచి నప్పుడు మఱింత వ్యాకులతఁ జెందెను. ఆమె యౌవనసౌంద ర్యము నిజముగ వసంతకాలమును స్ఫురింపఁజేసెను. ఆప్రాంత మంతయు సువాసనలతో నిండిపోయెను. ఆతని కేదియో పక్షి తెక్కలవలనఁ గలిగెడు ధ్వని యొకటి వినఁబడెను. ఆమెరథ మునులాగు తెల్లనిపావురము లామెచుట్టు నెగురుచున్నట్లుండెను. కాని యవి యితరులకంటెఁ బడకుండెను.

ఆ దేవతాస్త్రీలు ముగ్గురు నెవరిమట్టునకు వారు ప్యారిస్ వలన నెన్నుకొనఁబడుటకుఁ గుతూహల పడుచుండిరి. అతఁడా ముగ్గురిలో మిన్నయగు సుందరి యెవతెయో గ్రహింపఁజాలక నిశ్చేష్టుఁడై యుండెను. ముగ్ధుఁడై యున్నయాతని వారు వివిధప్రయత్నముల నాకర్షింప సాగిరి.

'హీరా' యిట్లనెను. "ఓయువకుఁడా! నా చక్కఁదనమును నీవు మెచ్చుకొనవా? నీవు నన్నెంచుకొనినచో నీకెంతయు నధికారమును గొప్పఁదనమునుఁ జేకూర్చెదను."

అథీనా "ఆ బహుమానమును నాకు రానిమ్ము. యుద్ధదేవతాకన్య నైన నాసాహాయ్యమున నీ వెట్టియుద్ధముల నైన నతిసులభముగఁ జయముఁ గాంచఁ గలుగుదువు. అట్టి నీవు జీవితమంతయు మహాగౌరవమునఁ గడపి వీరుఁడవై వీరస్వర్గము నొందఁ గల" వనెను.

'ఆఫ్రొడైట్' "నీవు నన్నెన్నుకొంటివా నీకు గ్రీసు దేశములోని స్త్రీలలోనెల్ల మిక్కిలి యందకత్తెయగు యువతిని భార్యగాఁ గానుక నిచ్చెద" ననెను.

అమాయకపుగొల్లపిల్లవాఁడగు ప్యారిస్‌నకుఁ గడసారి యాపెమాటలే మిగుల రుచించెను. తక్కినవారు వచించిన మాటలలోని గొప్పఁదన మాతఁడు గ్రహింపలేకపోయెను. వెంటనే యా బంగారురేఁగుఁబండును 'ఆఫ్రొడైట్' దేవత చేతిలో నుంచెను.

ఆమె తత్క్షణమె మహదానందమున వెడలిపోయెను. హీరా యథీనా లాగ్రిహాపరవశలైరి. "ప్యారిస్ తొందరపడి యెన్నుకొనెను. ఎప్పుడో యొకప్పు డీతఁ డిందులకై తప్పక పశ్చాత్తాప మొందఁగలఁ"డని వారిరువురు నిందించిరి. పిమ్మట వారును మెల్లఁగ నదృశ్యలైరి.

## 3

కొంతకాలమునకు 'ట్రాయ్' నగరమున 'ప్రియమ్' రాజేదియో యుత్సవముఁ జేయఁ దలపెట్టెను. ఆరోజులలో నుత్సవ సమయములలో దేవతారాధనకొఱకు జంతువులను బలియిచ్చు వాడుక మిక్కుటముగ నుండెను. అందు బలియీయఁబడు జంతువులు, బాగుగ బలిసియుండినవి కావలసియుండెడివి. ఆ యజ్ఞపశువు లేమాత్రము బలహీనములుగ నున్నను, నన్యాకారములుగ నున్నను ముదిసినవైయున్నను వారి దేవత లాగ్రహించెదరని వారల గట్టి నమ్మకము.

కాఁబట్టి 'ప్రియమ్' రాజు తన కుమారులలో నిద్దఱి కిట్లాజ్ఞాపించెను. "మీ రాసమీప పర్వతప్రాంతముల కేఁగినచో మిక్కిలి బలముగలజంతువులు దొరకఁగలవు. అట్టి వానినిఁబట్టి సమర్పించినచో దేవతలు తృప్తిఁ జెందుదురు. కావున మీ రిప్పుడే పోయి యట్టి జంతువులను బట్టితెండు."

అంత సోదరు లిరువురును బయలుదేఱిరి. ఆ సమీప

పర్వతములఁ జేరిరి. అక్కడ నొక చక్కని యెద్దునుఁ గాంచిరి. "ఈచక్కనియెద్దును దీసికొనిపోయినచోఁ దండ్రిగా రెంతయు సంతసింపఁగల" రని వారిలో వా రనుకొనిరి. ఎద్దును బట్టుకొని వారు తమనగరమువైపు నడిపించుచుండిరి.

ఆయెద్దు 'ప్యారిస్' దై యుండెను. కొంతదూరము వా రాయెద్దును దోలుకొని పోయినపిదపఁ గొండమీఁదనుండి ప్యారిస్ వారినిఁ గాంచెను. "దొంగలు, దొంగలు!" అని యాతఁ డఱచెను. సాధ్యమయినంత వేగముగఁ గొండదిగివచ్చి యాతఁడు తనయెద్దును దొంగిలించుట న్యాయముకాదని కేక లిడుచు నాబలవంతులైన రాకుమారుల నెన్నాడెను.

వా రాతనిమాట యిసుమంతయు లక్ష్యపెట్టలేదు. ఆ విధమున నెద్దువెంబడి 'ప్రియమ్' రాకుమారులును వారివెనుక 'ప్యారిస్'ను పరుగిడుచు ట్రాయ్‌నగర ద్వారమును సమీపించిరి. 'ప్యారిస్' యేడ్చుచు "రాజుగారిని దర్శించి న్యాయము దయ చేయింపుఁ" డని వేఁడుకొనెను.

రా జాతనిచరిత్రయంతయు నడిగి తెలిసికొనుచుండ నచిర కాలములోనే ప్యారిస్‌పూర్వవృత్తాంత మంతయు బయలు వడి నది. "ఇతఁడు మనకుమారుఁడే, మనబిడ్డఁడే, తిరిగి మనదగ్గ ఱకుఁ జేరుటకై భగవంతుఁ డీతని సంరక్షించియుండు" నని రాజు సంతసమునఁ గేక లిడెను. రాణియు నతనిఁ దనపుత్త్రుఁడని గ్రహించి యాతని సౌందర్యమును యువయువసౌష్ఠవమునుఁ

గాంచి తనభయంకర స్వప్నవిషయముల మఱచెను.

'ప్యారిస్'ను రాజభవనములోనికిఁ గొంపోయిరి. ఆతనికి విలువగల దుస్తులు ధరింప నిచ్చిరి. ఆతనిసోదరు లతనికి ఘన మగు స్వాగత మిచ్చిరి. అప్పటినుండియు 'ప్యారిస్' జీవనమున మార్పు గలిగెను. అతఁడు మరల మహారాజకుమారుఁడై మిక్కిలి సుకుమారముగ మెలఁగుచుండెను. ప్రస్తుతపు టానంద దినము లాతని వెనుకటికష్టదినములను మఱపుఁగొలిపినవి.

'ఆఫ్రొడైట్' దేవత తన కొసఁగిన, వరముమాట యా తనికి జ్ఞప్తియందులేదు కాని 'ఆఫ్రొడైట్' మాత్రము తన వాగ్దానము మఱువలేదు. ఒకనాఁ డొంటరిగ నున్నతనికి ప్యారి స్‌న కామె ప్రత్యక్ష మాయెను. అతనికిఁ దానొసఁగిన వరము సంగతి జ్ఞాపకముఁ జేసెను.

"సరియే, నీవు నాకొసఁగుభార్యను నే నెచ్చట గ్రహిం పఁగలుగుదునని యాతఁ డామెను ప్రశ్నించెను. ఆమె యిట్లు జవా బొసంగెను. "నీ వొక యోడపై నెక్కి తిన్నగఁ బశ్చి మమునకుఁ బ్రయాణము సాగింపవలెను. కొన్నాళ్లకు నీవు 'హెల్లాస్' అను నొక సుందరదేశమును జేరుదువు. నీవచ్చట నా సౌందర్యలలామను జూడఁ గలుగుదువు."

ఇట్లు చెప్పినతోడనే ప్రయాణమునకుఁగావలసిన యోడ యును సామగ్రియు సిద్ధము చేయఁబడెను. వెడలుటకు నియ మింపఁబడిన దినము వచ్చెను. 'ప్యారిస్' తన మాతాపితలకు

నమస్కరించి వారిసెలవుఁ గైకొని తనహితులఁ గొందఱను వెం టఁబెట్టుకొని 'హెల్లాస్' ప్రాంతమునకుఁ బయనమయ్యెను. 'హెల్లాస్' ప్రాంతమునే 'గ్రీస్' అందురు. అందలి గొప్ప నగరములలో 'స్పార్టా' నగర మొకటి.

'మెనీలాస్' స్పార్టాకు రాజు. ఆతనిభార్య 'హెలెన్' అనునామె మహాసౌందర్యవతి యని పేరుఁ గాంచెను. అంతకు మున్నెన్నఁడు నట్టి సౌందర్యవతి జగమున జన్మించియుండలేదని యామె విఖ్యాతి వడసెను. ఆమెముఖారవింద సందర్శనము ప్రతిమానవుని ప్రేమోన్మాదమున ముంచితీరును. 'ప్యారిస్' యొక్క వీక్షణము లామెపై మొదటిసారి ప్రసరింపఁగనే, 'అఫ్రొ డైట్' దేవతచే నూహింపఁబడినసుందరి యీామెయే యని యాతని హృదయమున స్ఫురించెను. నేను నిశ్చయముగ నీమెను వివాహమాడినచో నెంతటి యదృష్టవంతుఁ డనఁదగుదునోగదా! యని యాతఁ డూహించెను.

౪

స్పార్టారాజైన 'మెనీలాస్' 'ట్రాయ్' రాజకుమా రుఁడైన 'ప్యారిస్'నకును, ఆతని మిత్రబృందమునకును, నత్యంతా దరముతో స్వాగత మొసఁగెను. దూరదేశమునుండి సముద్ర ములు దాఁటి తనదేశమునకు వచ్చినవారగుటవలన వారికి కమిత మగు మర్యాదలు జరుపఁబడినవి.

ప్యారిస్ తనవెంటఁ దీసికొనివచ్చిన విలువగల వస్తువు లలోఁ బెక్కింటిని రాజునకును రాణికిని బహుమానమొసం గెను. మఱియు నాతఁడు హెలెన్ రాణి కనేకచిత్రవిచిత్రము లగు తనదేశపుఁగథల నెన్నో జెప్ప మొదలు పెట్టెను. ఆమెయు నాచిత్రము లన్నిఁటిని దనకన్నులాఱఁ గాంచ నభిలషింప సాగెను.

ఇట్లు కొన్నిరోజులు గడచినవి. 'ప్యారిస్' రాజభవన ముననే యుండి రాజదంపతుల కత్యుత్సాహకరములగు గాథలఁ జెప్పుచు వారల నానందనిమగ్నులఁ జేయుచుండెను. ఒకనాఁడు 'మెనీలాస్' సముద్రముపై దూరముగఁ బ్రయాణముఁ జేయ వలసిన యక్కఱ సంభవించెను. చాలరోజులవఱకాతఁడు తిరిగి వచ్చుటకు వీలులేదు. అతఁడు తన సతీమణిని 'ప్యారిస్'ను నింట నునిచి వెడలిపోయెను.

పరాంగన యని సందేహింపక, రూపవతియగు 'హెలెన్' కొఱకై వేచియున్న 'ప్యారిస్'న కదియే మంచితరుణ మగు టచే నాతఁడామెను వివిధోపాయముల నాకర్షింప సాగెను. ఆమెను నిజనగరమును వీడి ఘనతవహించిన ట్రాయ్‌నగరము నకుఁ దనతో రమ్మని ప్రార్థించెను. ఎట్టకేల కామె యొప్పు కొనెను. వారి కాప్రయాణమునకుఁ గావలసినవాని నన్నిఁటిని సమకూర్చుకొనిరి. ఒకనాఁటిరాత్రి చీఁకటి సమయమందు వారిరు వురును స్పార్టారాజభవనమును విడిచిరి. సముద్రముదరికిఁ జేరిరి. వారికొఱ కోడ సిద్ధము చేయఁబడెను. 'హెలెన్' 'ప్యారిస్'

లిరువురు నోడ నెక్కిరి. అప్పుడు గాలి విస్తారముగ నుండెను. తెరచాఁప లెత్తఁబడినవి. గాలి యానోడ నతిశీఘ్రముగ సము ద్రములోనికి లాఁగివై చెను. ఎట్టులైనను వారు జంకక నాయర్ధ రాత్రియందుఁ బయనమై స్పార్టానగరము విడిచి ట్రాయ్‌నగర మునకుఁ బోవుచుండిరి. కామాంధులైన వారి కేది యొనరింప వచ్చునో, యేది యొనరింపఁగూడదో తెలియదుగదా! 'ప్యారిస్' అదివఱ కెన్నఁడు నట్టి కష్టమగు ప్రయాణము సాగించియుండ లేదు. 'హీరా' 'ప్యారిస్'ను శిక్షించుటకై తరుణముకొఱకు వేచి యుండెను. అప్పు డామె వెంటనే యొకపెద్దతుపానుఁ గల్పించెను.

ఉఱుములు, మెఱపులు, పిడుగు భయంకరముగ నుండెను. సముద్రమంతయు నల్లకల్లోలమై పోయెను. ప్రతి క్షణమందు నోడ మునిఁగిపోవునంతటి భయముగా నుండెను. భయోత్పాదకములగు పెద్ద పెద్ద కెరటము లోడ కిరుపార్శ్వములఁ గొట్టుచుండెను.

అట్టితఱిని ప్యారిస్ తప్పించుకొనుట కష్టసాధ్యముగ నుండెను. ఆతఁ డొనరించిన సుకృతమువలననో 'ఆఫ్రొడైట్' సాయము వలననోగాని యానాఁడు తటస్థించిన కష్టసముదాయ ముల నన్నిఁటిని దాఁటి 'ప్యారిస్' 'హెలెన్' సహితముగ 'ట్రాయ్' నగరముఁ జేరెను.

నగర మంతయు నూరేఁగి, ప్యారిస్ 'హెలెనా'ను తన తల్లికడకుఁ దీసికొనిపోయి యిట్లనియెను. "తల్లీ! ఇదిగో

ఈమెయే నాభార్య. నన్నుఁ బ్రేమించినట్లే యీమెనుఁగూడ నీవు ప్రేమించవలెనని నాకోరిక."

'ప్యారిస్' 'హెలెనా' లఁజూచి 'ప్రియమ్' 'హెక్యూబా' లు మిక్కిలి సంతసించుచుండిరి.

అంతట రాజదంపతు లిరువురును, వెనుక రాణిగనిన కల యొక్క ఫలితములు నిక్కములు గావనియు మహాసౌందర్యవతియగు గ్రీసుదేశపురాణిని భార్యగాఁ దెచ్చుకొనిన ప్యారిస్ తమకు సుపుత్త్రుఁ డనియు నమ్మియుండిరి.

౫

ప్యారిస్ హెలెనాలకు మహావైభవమునఁ గళ్యాణ మహోత్సవము జరిగినది. 'ప్యారిస్' అత్యంతానందమున మునిఁగియుండెను.

ఈలోన గ్రీసుదేశములోని చారులు 'మెనీలాస్' కడ కేఁగి యాతనిభార్యను ప్యారిస్ గొనిపోయిన వృత్తాంత మంతయుఁ దెలిపిరి. తత్క్షణమే యాతఁ డింటికిఁ జని తన మంత్రివర్గమును మిత్రబృందమును గలిసికొని కర్తవ్య మాలోచించెను.

"కొంతసేనను వెంటఁబెట్టుకొని ట్రాయ్ నగరముపై దండెత్తిపోయి బలవంతముగ హెలెనాను తిరిగి తీసికొనిరావలె" నని వారందఱు సలహా నిచ్చిరి. మఱియు, ప్యారిస్ చేసినస్వామిద్రోహమునకు వానికిఁ బ్రాయశ్చిత్తముఁ గావింపవలెననియు

ట్రాయ్‌నగరమును విధ్వంసముఁ గావింపవలెననియుఁ బ్రోత్స హించిరి. మఱియు ప్యారిస్‌ను ఆతనిస్నేహితులగు ట్రోజను లను బూర్తిగా నీప్రపంచమున నిశ్శేషులగునట్లుగాఁ జేయవలె నని మిక్కిలి హెచ్చరించిరి.

వెంటనే 'మెనీలాస్' తగుప్రయత్నములఁ గావిం చెను. గ్రీసుదేశములోని యత్యధికబలసంపన్నుల నందఱినిఁ జేరఁదీసెను. అందుఁ 'అఖిలీస్' వంటియుద్ధవీరు లుండిరి. 'ఒంటి కన్ను పాలిఫీమస్' నంతమొందించిన మహాధీరుఁడును యుక్తిప రుఁడు నైన 'యూలిసీస్' యొక్క సోదరుఁడైన 'అగమెమ్నాన్' మొదలుగాఁగల మహావీరశిఖామణు లెందఱో యా సేనయందుఁ బాల్గొనిరి. సుమా రొకవెయ్యి పడవల నిండుగఁ గూర్చుండి యశేషమగు యుద్ధసామగ్రిని బ్రోవుజేసికొని గ్రీకులు ట్రాయ్ నగరముపై దండెత్తిరి. వారి భేరీనినాదములును, విజయధ్వాన ములును వినువారికుండె లదురఁ జేసెను. మార్గమధ్యమం దనేక కష్టములకు లోనై తుదకు ట్రాయ్‌నగరపు టొడ్డున దిగి తమగుడారముల నెలకొల్పిరి. గ్రీస్ సైన్యములు ట్రాయ్‌నగర మును ముట్టడించెను. ట్రోజనులు బయటికి రా వీలు లేకుం డెను. ఉన్నంతవఱకుఁ దమ నగరములోని తినుబండారములఁ దినవలసినదే గాని పైనుండి తెచ్చుకొనుటకు వారికి వీలులేదు. వారీవిధమునఁ గొన్నాళ్లకుఁ దినుబండారములకై యిబ్బంది పడవలసిన వారైరి.

రెండుపక్షములవారికిఁ దొమ్మిదిసంవత్సరములు మహా సంగ్రామము జరిగెను. పదియవసంవత్సరమున ట్రోజనులు పూర్తిగా నాశనమైరి. మందుచున్న కొలఁదిపులఁ జేతఁబట్టుకొని గ్రీకులు 'ట్రాయ్' నగరమును నాల్గుమూలల నంటించిరి. నగరమంతయు దగ్ధమైపోయెను. ట్రాయ్‌నగరము నామమాత్రావశిష్ట మయ్యెను. 'ప్యారిస్' చంపఁబడియెను. మెనీలాస్ 'హెలెనా'ను గైకొని గ్రీసుదేశమునకుఁ దీసికొనిపోయెను. హెక్యూబాగాంచిన వింతకల యథార్థ మాయెను. ప్యారిస్ నిజముగఁ దనమాతృదేశ వినాశనమునకుఁ గారణమైన కొఱవియైపుట్టి స్వయంకృతాపరాధమున మరణించెను.

# భూతదయ

౧

చ్యవనునిపుత్రుఁడగు ప్రమతికి రురుఁడను కుమారుఁడు గలఁడు. ఆతనితల్లి యమృతమున జనించిన ఘృతాచి. రురుఁడు దీప్తిమంతుఁడు, విద్యావంతుఁడు, నిష్ఠాగరిష్ఠుఁ డగు ముని శ్రేష్ఠుఁడు.

గంధర్వరాజగువిశ్వావసునకు నప్సరసలలో నొకతెయగు మేనకవలన నొక కొమరిత కలిగెను. శైశవమునుండియు నామె స్థూలకేశుఁడను నొకమునినాథుని యాశ్రమమునఁ బెరుగుచుం డెను. ఆకన్నియ మిక్కిలి రూపవతి. లావణ్యరాశి. సుగుణం బులప్రోవు. ఆబిడ్డ సర్వవిషయముల నితరప్రమదలకంటె నుత్కృ ష్టయగుటవలనఁ బ్రమద్వరయను నభిధేయమున నొప్పుచుండెను.

రురునిప్రతిభావిశేషములఁ బ్రమద్వరయుఁ బ్రమద్వర రూపలావణ్యగుణగణంబుల రురుఁడును దెలిసికొనిరి. పరస్పరము స్నేహభావ మంకురించెను. రోజులు గడచినకొలఁది వారి గాఢ మైత్రి ప్రేమగాఁ బరిణమించెను. ఒండొరులు పరిణయమాడ నిశ్చయించుకొనిరి.

ఒకనాఁడు ప్రమద్వర చెలికత్తెలతోఁగూడి వనవిహారము సలుపుచుండ దురదృష్టవశమున నొక్కయెడ నొక కూరసర్ప

మామెపాదములక్రిందఁ బడెను. ఆమె తొట్రుపాటుఁ జెంది దానిమీఁకఁ ద్రొక్కిన నా భుజగము బుస్సు మనుచు నామెపై కుతికి యొక్క కాటు వైచెను. ప్రమద్వర సర్పదష్టయై వెంటనే యవనిపైఁ ద్రెళ్ళెను. కన్నియ లందఱు భయకంపితలై యఱచుచుఁ బరువులిడిరి. దయాంతరంగులగు కణ్వ, గౌతమ, భరద్వాజ ప్రముఖమునివరు లెల్లరు నీయుదంత మెఱిఁగి స్థూలకేశాశ్రమమున కరుదెంచిరి. జనకుఁడైన ప్రమతియుఁ బరుగెత్తి వచ్చెను. రురుం డతిసంభ్రమంబున నా ఘోరవార్త విని రోజుకొనుచు నతిశీఘ్రముగఁ బఱతెంచెను. అంతలోననె యాకుమారిక శరీరమంతటను విషము వ్యాపించెను. ఆమె ప్రాణములు పోవుచుండెను. అప్పు డచట నున్నవారందఱును శోకపూరితహృదయులైరి.

రురుం డాఱనిదుఃఖానలమున కోర్వఁజాలక తత్క్షణమె యరణ్యమునకుఁబోవ నిశ్చయించుకొని యిట్లు విలపించెను. "అయ్యో! నాప్రాణధనము ప్రాణములఁ గోల్పోవునేమో? నా కింకేదిదిక్కు, నన్నీయాపదనుండి తప్పించువార లెవ్వరు? నేనే దేవతలకు, మర్త్యులకు, సర్వప్రాణికోటికి హితమగు పుణ్యకర్మలఁ జేయువాఁడనేని, నేనే పెద్దలయెడల భక్తివినయములు గలవాఁడ నయియుందునేని, నేనే తపశ్శాలిని నేని, ఓదేవతలారా! మీయెదుట నాహృదయేశ్వరి విషనిర్ముక్త యగుఁగాక! ఓయయ్యలారా! మీరలందఱు ననేక విషతత్త్వముల నెఱింగిన మాంత్రికులు, నిపుణులును,

తాంత్రికులును, మహాపురుషులైన మీర లేదైన నుపాయ మొనరించి విషము వెడలించి నాహృదయేశ్వరిని నాకుఁ బ్రసాదించరా! నాతపమువలనను, నావిద్యాదానమునలనను గలిగిన ఫలితమంతయు మీకు సమర్పించుకొనెద" నని యాక్రందనముఁ జేసెను.

శోకవ్యాకులితహృదయుండును, దీనాననుండును నగు రురుని మొఱలాలించి యాతనికిఁ బ్రియ మొనరింపనెంచి యాకాశమునుండి యొక దేవదూత యిట్లనియెను. "ఓయయ్యా! విధి వశంబునఁ గల్గిన యియ్యాపద్రివము నెవరును దప్పింపఁజాలరు. అవశ్య మనుభవింపవలసినదే. కాని నా కొక్కయుపాయము దోఁచుచున్నది. నీ యాయువునందు సగ మామె కర్పించినచో నామె బ్రదుకఁగలదు. ఇందులకు సమవర్తియు నియ్యకొను" నని వచించెను.

రురుఁ డత్యంతామోదమున వెంటనే తన యాయువునం దర్థం బామె కిచ్చెను. ప్రమద్వర తత్క్షణమే విషనిర్ముక్తయై యితోధిక రూపలావణ్యముల వెల్గొందెను. ధర్మరాజానుమతమునను, దేవదూత వాక్యములవలనను, ప్రమద్వరకు మృత్యువు తప్పెను.

రురుఁడును బ్రమద్వరయు వివాహమాడి యిష్టవిహారముల సల్పుచు సుఖంబుగఁ గాఁపురము సేయుచుండిరి.

౨

రురుఁడు ప్రియురాలిని రక్షించుకొనుటకుఁ దన యాయుఃప్రమాణము దానమిచ్చుట

రురుఁడు ప్రియురాలిని రక్షించుకొనుటకుఁ దన యాయువున సగసా లామె కర్పించి తన కపకార మొనరించిన యురగకులముపైఁ దఱుఁగని కోపమునఁ దత్కులమంతయు నాశన మొనరింపఁ బ్రతిజ్ఞ చేసినవాఁ డగుటచే నాఁటినుండియుఁ గాననములఁ దిరుగుచుఁ బన్నగములుండు పుట్టలన్నియు వెదకి వెదకి యందలి పాముల నన్నిఁటిని భీకరదండప్రఘాతములచే నంత మొందించుచుండెను.

కొంతకాల మిట్లు భుజగములఁ బొలియించుచు నతం డొక మహాసర్పముం జంపఁ దలఁచి తన భీకరదీర్ఘదండముఁ బైకెత్త నా ద్విజిహ్వము భయకంపితమై "హరిహరీ" యని కేక లిడుచు "ఓయయ్యా! నీవెవఁడవు. నీ యాకారమునుబట్టిచూడ నీ వొక సద్బ్రాహ్మణ వంశసంభవుఁడ వనియు, సద్వ్రతసంపన్నుఁడ వనియు, సర్వభూతసమవర్తి వనియు, నే నూహించుచున్నాను. అట్టి నీ వీట్లేల నిష్కారణముగఁ బన్నగములఁ బరిమార్పనెంచెదవు." అని యడిగెను.

తాను రురుఁడ ననియుఁ, దనప్రియురాలగు ప్రమద్వరకును దనకును సర్పము లేవిధమున నపకార మొనరించెనో యది యంతయునుఁ జెప్పి తా నప్పటినుండియుఁ బన్నగములనెల్లఁ బరిమార్ప నమకట్టితినని వచించుచు నమ్మహాహినిఁ గూడ వ్రయ్యలు గావింపఁ దన కరమునందలి భయంకర దండమును

మఱలఁ బై కెత్తెను. తత్క్షణమె యా మహాసర్ప మొక ముని వరుఁడై నిల్చి తనవృత్తాంత మంతయు నిట్లు రురున కెఱింగించెను.

"నేను సహస్రపాదుఁడను ఋషిని. ఖగముఖుఁడను నా సహాధ్యాయుఁ డగ్నిహోత్రగృహమున నున్నతఱి నే నాత నిపై గడ్డిపాము నొకదానినిఁ బడవేయ నాతఁ డందుల కలిఁగి నీవు విషములేని పాము వయ్యెదవుగాక, యని నన్ను శపించెను. నేరక చేసిననా నేరమును క్షమింపుమని నే నతనిని వేఁడఁ దన వాక్య మమోఘమనియు, భృగుకులవర్ధనుండగు రురుండు నీశా పవిమోచనముఁ జేయఁ గలఁడనియు, వచించెను.

ఆతని వచనప్రకారము నేఁటికి నీవలన నాశాప విముక్తియైనది. పుణ్యామూర్తివగు నీ వెఱుఁగని ధర్మములు లేవు. అయినను నీ కొక విషయముఁ జెప్పఁ దలంచితిని. నీవు సద్బ్రాహ్మణుండవు. జ్ఞానసంపన్నుఁడవు. సర్వభూత హితుఁ డవు. సర్వసముఁడవు. శాంతుఁడవు. కరుణాఢ్యుఁడవు. వేదహి తుల ననుష్ఠించువాఁడవు. "అహింసా పరమోధర్మః" అని యందురు కావున హింస చేయుట నీకుఁ గానిపని. జనమే జయుఁడనురా జొనరించు యాగమున నీ దుష్టోరగము లన్నియు నశింపఁగలవు. కావున నీ విఁక పీనినిఁజంపు టుడుగు మని వచిం చెను. రురుఁ డప్పటినుండియుఁ దన కోప ముపసంహారించుకొని సర్పమారణమును మానివైచి సర్వభూతదయాపరుఁడై మెలం గుచుండెను.

---

# సహగమనము.

## ౧

మొగలాయి మహాసామ్రాజ్య సార్వభౌముఁ డక్బరు. ఆతఁడు గుజరాత్ రాజ్యమును స్వాధీనముఁ జేసికొనురోజులలో నొకదినమున రాజపుత్రస్థానపు సరిహద్దులనుండి యొక మహా సైన్య మరుగుచుండెను. ఆసైన్యము తమచక్రవర్తియగు అక్బరు స్వయముగ నడుపుచున్నసేనను గలసికొనుటకై గుజరాత్ నకుఁ బోవుచున్నది.

వారి హస్తములలోని కత్తులు, డాళ్లు, శరీరములయందలి కవచములు ధగధగ మెఱయుచుండెను. ఆసైనికు లత్యంతోత్సాహముతో నుండిరి. అబ్బాస్‌ఖాన్ అనునాతఁ డాసేనకు నాయకుఁడు. ఆతఁ డొక మొగలాయియోధుని కుమారుఁడు. ఆతఁ డాజానుబాహుఁడు. దృఢశరీరుఁడు. స్ఫురద్రూపి. యువకుఁడగుటంబట్టి యతని ముఖమందొక విధమగు నూతన యౌవన విలాసము తాండవ మాడుచుండెను. మఱియుఁ బరాక్రమశాలి యగు అక్బరుసార్వభౌముని నాయకత్వమున జరుగు నా యుద్ధమునఁ దన భుజశక్తి వినియోగించి పేరువడయు నుత్సాహముతో ఖానుఁ డుప్పొంగుచుండెను.

కొంతదూర మరిగినతరువాత దూరమునుండి గుఱ్ఱముల పంక్తియొకటి యీ మహమ్మదీయసేన కెదు రాయెను. ఆ

గుజ్జురౌతులు హైందవరాజపుత్రులు.ఆ యశ్వదళము నిశ్శబ్దముగా నెమ్మదిగా నడచుచుండెను వారితో నొక సవారి వచ్చుచుండెను. ఆ సవారితలుపులు మూయఁబడి యున్నవి. అందుంచఁబడిన నారీమణి సకల శోభామయంబగు మానవప్రపంచమునుఁ జూడలేకపోవుటయేగాక గాలినైనను సైతము పీల్చలేకుండునట్టి దురవస్థ యం దుండెను. ఇరుప్రక్కలఁ గల సహజమగు ప్రకృతిసౌందర్యమును జూచి యానందించుటకైన నామెనోఁచుకొనలేదు.

హైందవపటాలములవారు రోహిణీనదియొద్దనుఁ బయనము సాగించుచుండిరి. సాయంసమయ మగుచుండెను. ఒక దొంగలగుంపు హఠాత్తుగ వచ్చి రాజపుత్రుల నడ్డుకొనినది. గుంపులోనివా రా సవారి నాఁపిరి. రాజపుత్రుల నందఱిని దఱిమివైచిరి. సవారి నాక్రమించుకొనిరి. తలుపులఁ బగులఁగొట్టిరి. అందున్న యువతి నీవలకు లాగిరి. ఆయువతి మిగుల సౌందర్యవతి. అతిసుకుమారి. ఆమెపేరు తులసీబాయి. అప్పుడామె తన యత్తవారియింటికిఁ దీసికొనిపోఁబడుచున్నది.

౨

ఆ గుంపులోని మోటుమానవులైన దొంగ లందఱు నామెనుఁ జుట్టుకొనిరి. పాపము తులసీబాయి స్మృహతప్పి పడిపోయెను. ఆ తరుణికి సుమారు పదునైదు వత్సరముల ప్రాయ

ముండెను. ఆమె తల్లిదండ్రుల కేకపుత్రిక యగుటవలన నత్యంత గారాబమునఁ బెంచఁబడినది. చిన్నతనమునుండియుఁ గష్ట మన నేమియో యెఱుఁగనిదేల యీ తులసీబాయి. కొంతతడవున కామె కొకింత స్మృతి కలిగినది. దొంగలను జూచినయంతనె తులసీబాయికి పురాణకథలలోని పెద్దపెద్ద భూతములు దయ్యములు జ్ఞప్తికి వచ్చినవి.

దొంగ లామె యమూల్యాభరణముల నన్నిఁటినిఁ దమ కిచ్చివేయుమని దండించిరి. అందుల కామె యెదురు చెప్పనేర దయ్యెను. భయకంపిత యగుటచే నామె కంఠమునుండి విలువ గల ముత్యాలహారములును, చెవులనుండి కమలములును, ముక్కునుండి నత్తును, కాలుసేతులనుండి బంగారుగొలుసులు గాజులును, దీసివేసి యిచ్చుట కామె చేతు లాడినవి కావు. తులసీబాయి జాగు సేయుచుండుటచే దొంగ లామెను దాఁకి యామెవస్తువులఁ బెఱుకుకొనుటకు సంసిద్ధు లగుచుండిరి.

ఈకోలాహలము మొగలాయిసేనానాయకుఁడగు అబ్బాస్ ఖాను నాకర్షించినది. వెంటనే ఖానుఁడు తన సైన్యము నచ్చోటికి మఱల్చెను. మొగలాయిసేనలఁ జూచినతోడనే దొంగలు చెట్టున కొకరుఁడై పరువు లిడిరి. భయకంపితయగు తులసీబాయి మాత్రి మచ్చటనే క్రిందఁ బడియుండెను. ఆమె దుఃఖసముద్రమున మునిఁగిపోయెను. ప్రాణరక్షకుఁడైన ఖానుఁడు సమీపించుకొలఁది నామెకు ధైర్యము హెచ్చుచుండెను. ఆమె శరీర

చ్ఛాయయే మాఱెను. నూతనతేజస్సు ప్రకాశింపఁ దొడఁగెను. ఆమె యంతకు మున్నెన్నఁడు నట్టి యద్వితీయభుజబలశాలియగు సుందరాకారునిఁ గని యెఱుంగదు. జన్మించిన దాది నాఁటివఱ కితరముగవానినే యామె చూచియుండలేదు.

ఖానుఁ డామె వదనమును వీక్షించెను. ఆమె చల్లనికనుదామరలనుండి బాష్పబిందువులు జాఱెను. ఆమెయు నాతని వదనమును గ్రిగంటఁ జూచెను. ఆతని హృదయము వివశమయ్యెను. ఆ జవరాలి చూపులే యతని హృదయమునఁ బ్రేమబీజములు నాటినవి. పాప మాతఁడు వేదనఁగూడఁ బొందినాఁడు. అత్యంత జాగరూకతతో నాతఁ డామెను సహాయం దాసీనురాలిగఁ జేసెను. ఆతని మనస్సునందొక నూతనోత్సాహకరమైన యూహ జనించెను. ఆకాశహర్మ్యములు గట్టనెంచెను. "ఈయరణ్యమధ్యమున నున్న నిజదుర్గములోని కీ సుందరిని దీసికొని పోయినచో నచ్చట నెంతసుఖముగఁ గాలముఁ గడుపవచ్చునో? ఏదైన సుందరమగు కుటీరమున నీ కుటిలకుంతలి నుంచినచో నితరప్రపంచవిషయముల కెంతమాత్రము సంబంధము లేకుండ నెంతయానందముగ జీవయాత్రఁ గడుపవచ్చునో" యని యాతఁ డాలోచించుచుండెను.

ఆక్షణములోనే తనసార్వభౌమునియెడఁ దాను నిర్వహింపవలసినకార్యము విధాయకకృత్యమని స్ఫురించెను. ఒక వంకఁ దనచే సాహాయ్య మొందిన తులసీబాయి ననునయిం

చుట. మఱియొకవంకఁ దనసార్వభౌముని యాజ్ఞఁ బాలించుట. మొదట సార్వభౌమునికార్య మొనరించుటయే ముఖ్య మని తలంచెను.

## 3

పిమ్మటఁ దులసీబాయి తన యత్తవారియింటికిఁ గొని పోఁబడుచుండెను. అబ్బాస్ఖానుఁడును దీర్ఘముగ నాలోచిం చుచు నామె సవారివెంటనే తనగుఱ్ఱమును నడపుచుండెను. ఆతఁడా సవారిలోనున్న తులసీబాయినిఁ జూచుటకు వీలు లేదు. ఆమె మాత్రము సవారితలుపుల సందునుండి యాతనిని జూడఁగలుగుచుండెను. చూచినకొలఁది నాతని సుందరాకార మామె హృదయము నాకర్షింపసాగెను.

కొంతదూర మరిగినపిమ్మట ఖానుఁడు తులసీబాయిని విడిచి వేఱొకమార్గమునఁ బోవలసి వచ్చెను. మాటలు తప్ప బడుచున్నను ఖానుఁడు నిశ్చలత్వము నటించుచు నేమేమో చెప్పుచుఁ దులసీబాయికి వీడుకోలు చెప్పెను. ఆమెయు నత్యం తాతురతతో క్షత్రియకులాచారమును వెనుదోసి సవారితలు పులఁ దెఱచి తన ప్రాణరక్షకుఁడగు ఖానున కొక వజ్రపుటుం గరము నందించెను. ఒక్కసారిగా నొండొరులు ప్రేమతో వీక్షించుకొనిరి. ఇరువురి కన్నులనుండియు నొక్కమా ఱానం దబాష్పములు గాఱెను. వెంటనే వారికి నిస్పృహ కూడ జనించెను.

ఖానుఁ డప్పుడు యుద్ధమున మహాఖ్యాతి వడయనెంచి పోవుచున్నవాఁడు. తులసీబాయి యత్తవారియింటికిఁ గొనిపోఁబడుచున్నది. కావున వార లచ్చట జాగుసేయుట కవకాశము గలుగలేదు. తులసీబాయికి ఖానునిపై నంతకంతకుఁ బ్రేమయధికమగుచుండెను. కాని తుదకుఁ జెరియొకతో్రివను బోవక తప్పినది కాదు.

ఆనాఁటి కథాసందర్భము ఖానుని హృదయఫలకము నుండి యొకనిముసమైనఁ దొలఁగిపోవుటలేదు.

ఖానుఁ డెచ్చట నున్నను, ఎట్టిస్థితియం దున్నను, ఆ నాఁటి యామె ప్రేమవీక్షణము లాతని హృదయమున నిలిచియే యుండెను. ఆతని తలఁపు లెప్పు డా యన్నులమిన్నపైననే దగిలియుండెను.

పిమ్మట నక్బరుచక్రవర్తి మీర్జావంశస్థులను డీకొనినప్పు డబ్బాస్‌ఖానుఁ డాతని ప్రక్కనే యుండి రణరంగమునఁ దన ధైర్యస్థైర్యములఁ జూచి సార్వభౌమునిచే మెప్పువడసెను.

తదనంతర మొకసంవత్సరము గడచెను. పాపము ఖానుని తండ్రి మరణించెనను వార్త వచ్చెను. ఈ ఘోరవార్త ఖానున కత్యంత భయవిచారములఁ గలుగఁ జేసెను. గృహవిషయము లన్నియు ఖానుఁడే చక్కఁబెట్టుకొనవలసిన యగత్యము సంభవించెను. కావున నాతఁ డక్బరుసార్వభౌమునియొద్ద సెలవుఁగైకొని రోహిణీనదీతీరముగుండ స్వగృహమునకుఁ బ్రయాణము సేయు

చుండెను. ఆతఁ డదివఱలోఁ దులసీబాయినిఁ గనుఁగొనిన దీ నదీ తీరముననే.

మహాజవసత్త్వముఁ గల యరేబియాగుఱ్ఱము నాతఁ డారోహించి యుండెను. యుద్ధమున విజయమొందినపు డాతని కా యశ్వము నక్బరుసార్వభౌముఁడు బహుమాన మొసఁగెను. ఖానుఁ డప్పుడు ధరించిన డాలును, కత్తియు, ధగధగ మెఱయు చుండెను.

పితృవిచారమునఁ గృశించు నాతఁడు నిరుత్సాహమున మెల్లమెల్లగఁ బోవుచుండెను. ఆతనియశ్వముకూడఁ దన యజమానుని మనస్స్థితిని గ్రహించినదానివలెనే మందముగ నడచుచుండెను.

౪

ఆతనిదృష్టి యాప్రక్కనేయున్న యొక శ్మశానవాటిక వైపు మఱలినది. ఆతఁ డొక దృశ్యముఁ గాంచెను. ఒక మృత కళేబరమును కొంతమంది వాహకులు మోసికొనిపోవుచుండిరి. ఆశవమువెంట ననేకమంది బందుగులు, స్నేహితులు నడచుచుండిరి. దానిపై మిక్కిలి విలువగల బట్టలు గప్పఁబడి యుండెను. అదియొక దురదృష్టవంతుఁడగు ధనికుని శవమై యుండ నోపునని ఖానుఁ డనుకొనెను.

పట్టుబట్టలను ధరించిన నలువురు మనుజు లాశవమును

మోయుచుండిరి. వారికిఁ గట్టుబట్టలేగాని యుత్తరీయములు లేవు. శవముముందఱఁ గొందఱు మెల్లగ నడచుచుఁ బెద్దధ్వనితో రామనామోచ్చారణఁ గావించుచు నచ్చటచ్చటఁ బిసికెడు బియ్యమును, గొన్ని తెల్లనివస్త్రములను, రాగిడబ్బులను, రూప్యములను వెదజల్లుచుండిరి. ఆమరణించినయాతని సన్నిహిత బంధువగు నాతఁడు శవము కాళ్ల వైపున నొకకుండతో నిప్పును గైకొని విచారముతో ముందు నడచుచుండెను. ఆగుంపులో రెండు గుఱ్ఱములుగూడ నున్నవి. ఒకగుఱ్ఱముపైఁ గూర్చుండి యున్నయాతఁ డొక పెద్దడోలును వాయించుచుండెను. రెండవ దానిపై నున్న రౌతు చుట్టఁబెట్టఁబడియున్న యొక జండాను చేతఁ బూనియుండెను.

త్వరలోనే వారందఱు శ్మశానవాటికను సమీపించిరి. ఆశవముసమీపమున నొకయెలనాఁగ నిలువఁబడియున్నది. ఆమె యా మృతిఁజెందిన యాతనిభార్య. ఆకాలమునఁ జనిపోయిన భర్తతోఁబాటు బ్రదికియున్న భార్యనుగూడఁ దగులఁబెట్టెడి యమానుషమైన దురాచార ముండెడిది. ఆయువతినిఁగూడ భర్తతోఁబాటు, చితిమీఁదఁ బడవేసి యగ్నిదేవుని కాహుతిఁ జేయఁ బెద్ద లందఱు నక్కడకుఁ జేరిరి.

అక్బరుసార్వభౌముఁ డాసహగమనదురాచారము నెట్లయిన రూపుమాపవలయునని శక్తివంచనలేక పాటుపడుచుండెను. 'ఏస్త్రీనిగాని బలవంతముగ సహగమన దురాచారమునకుఁ

బాల్యేయఁ గూడ' దను చట్ట మేర్పాటు గావించెను. మన యబ్బాస్ఖాన్ యువకుఁడు సాహసౌదార్యములతోను, మనో నిశ్చయముతోను నిట్టి సాంఘికదురాచారముల నంత మొందింపఁ దనసార్వభౌముని యడుగుజాడలలోనే నడచుచుండెను. రాజాజ్ఞఁ బాలించని ప్రజల నాతఁడు దండించుచుండెను. ఆతఁ డచ్చట గావింపఁబడియున్న చితిని సమీపించెను.

చితికి సమీపమున నుంచఁబడిన యాకోమలిబట్టలనిండఁ జమురు పోసిరి. చుట్టును బురోహితులు చేరి యామెకు ధైర్యముఁ బురికొల్పుచుండిరి. బలియీఁబడుటకు సిద్ధముగనున్న మేఁకవలె నాకురంగాక్షి యత్యంతభయానహయై యుండెను. కెవ్వుమని యేడ్చు నామెకంఠరవము వినఁబడకుండఁ జెవులు గింగురుమనునట్లు భేరీవాద్యములు విశేషముగ వాయింపఁబడు చుండెను.

అప్పటి హిందూమతాచారమునుబట్టి సాగుమాన మొన ర్చుకాంతలే తమభర్తలయెడల సంపూర్ణానురాగముఁ గలవార లని గణింపఁబడుచుండిరి. పెండ్లియననేమో యెఱుఁగని బాల లెందఱో నంఘముచే రగుల్పఁబడిన మహాగ్నిశిఖల కాహుతి సేయఁబడుచుండిరి. సహగమన మొనరింపనివనిత పతిభక్తిరహి తగాఁ బ్రజలనోళ్లలోఁ బడెడిది. నంఘము విధించిన యీఘోర కార్యము నెవరైన నతిక్రమించినచో నింత కెక్కుడగు వైధ

వ్యమునందలి కత్తికోఁతల ననుభవించుట మిక్కిలి దుర్భర మయ్యెడిది.

భర్తృవిహీనయగు మగువ నలుగురిలోన కరుదెంచుటకు వీలు లేదు. ఆమెను పరమకురూపినిగఁజేసి విడిచిపెట్టెదరు. ఆమె శిరోజములు గొఱిగించివేతురు. మైలైన వస్త్రము లామె ధరింపఁగూడదు. వైధవ్యమును సూచించు తెల్లనిగుడ్డలఁ గట్టుకొన వలయును. ఆభరణముల నలంకరించుకొనరాదు. కడుపునిండఁ దిండియైనఁ దినుటకు వీలు లేదు. పాపాత్మురాలగు వితంతువు ముఖముఁ జూచుటకైన నెట్టివారును నిష్టపడరు. కావున నిట్టి నరకయాతనకంటె సహగమనమే మేలని యామె తలంచియుండవచ్చును.

ఆమె దివ్యవస్త్రాభరణముల ధరించి భర్తచితిసమీపమునసే నిలువఁబడియుండెను. భేరీనినాదములు మిన్నుముట్టుచుండెను. రాక్షససమానులగు పురోహితులు సహగమనానంతర మామెబంగారు నేలుకొన వలయునని పేరాసచే నామెను ద్వర పెట్టుచుండిరి.

౫

అంతలో నబ్బాస్‌ఖానుఁడు వారిని సమీపించెను. సహగమన మొనరింప సిద్ధముగనున్న పడఁతిని బరిశీలించెను. కొంత తడవు నిశ్చేష్టుఁడై పోయెను. ఆమెయు నాతనిఁ జూచినది.

ఆమె మనమున నొక క్రొత్తయాశ పొడసూపినది. తన్నాఘో రకృత్యమునుండి తప్పించుట కీశ్వరుఁడే యాతనిఁ బంపియుండ వచ్చునని యామె తలంచెను.

ఖానుఁ డామెను తులసీబాయిగా గుర్తించెను. ఆమె యదివరలో కన్న సంపూర్ణయావనవతియై యుండినందుల కతఁ డమందానంద మొందెను. కాని ప్రస్తుత మామెకు సంప్రాప్తించిన ఘోరస్థితి కాతనిహృదయము వ్యయ్య లయ్యెను.

వారల ప్రథమసమాగమమునుండియు నొండొరుల హృదయము లొకటినొకటి యాకర్షించుకొనినవి. అప్పటినుండియు ఖానుని యాలోచన లన్నియు నామెనుఁ గూర్చియే. ఆమెయు నతని సందర్శన మిఁక దుర్లభ మని కాఁబోలు నిట్టి సాహస కృత్య మొనరింప సంసిద్ధురా లయ్యెను. అట్టి దురవస్థ యందున్న తులసీబాయిని రక్షించుట ఖానున కవశ్య కర్తవ్యమగుటచేఁ దటాలున నచ్చటిపురోహితవర్గములోని కాతఁడు చొఱుచుకొని పోయి యందులోఁ బెద్దగాఁ గనఁబడు వృద్ధబ్రాహ్మణు నొక్కనిఁ జూచి "సహగమనము మాన్పించుట కక్బరుపాదుషా యొనరించిన చట్టము మీ రెఱుఁగరా? వితంతు విష్టపడనియ ప్పుడు నిర్బంధించఁ గూడద నుమాట మఱచితిరా?" యని గట్టిగా నడిగెను.

"ఆమాట యామెనే యడుగుము. ఆమె చనిపోయిన వాని సహధర్మచారిణి కావునఁ దన పతివ్రతాధర్మము నిలువ.

బెట్టుకొనుటకై యామె తనంతటఁదాని సాగుమాన మొనరింప సిద్ధపడివచ్చిన" దని బ్రాహ్మణుఁడు బదులు చెప్పెను.

అంతట ఖానుఁడు తులసీబాయి నుద్దేశించి "ఓసుందరీ! సహగమన మొనరింపఁ జేయువారలు దండనార్హు లనియెడి సార్వభౌముని చట్టము నీవెఱుఁగవా? దారుణమైన యీయగ్ని శిఖలఁబడి మాడిపోవ నీవే తలఁచితివా? లేక నిన్ను వీరు నిర్బంధపెట్టుచుండిరా? నిజముఁ జెప్పు"మని యడిగెను.

తులసీబాయి ధైర్యముఁ దెచ్చుకొని రుద్ధమైన కంఠస్వరమును హెచ్చించి యతిదీనముగా నాతనితో "అయ్యా! దయామయుఁడవై నీవిదివఱ కొకసారి నన్ను క్రూరులగు చోరుల బాటినుండి తప్పించితివి. తిరిగి నేఁడీదురాచార పారీణులును, గఠినహృదయులు నగు బ్రాహ్మణఘాతుకులనుండి తప్పింప నరుదెంచితివి. కాని వీరందఱు నాచావుకొఱ కెదురు చూచుచున్నారు. ఈసమయమున నీవు తొందరపడినచో నన్ను వీరందఱుఁ బొదివిపట్టి చంపఁ గలరని భయపడుచున్నాను. నాకర్మమునకు నన్ను వదలుము. నీవొనరించిన మేలున కివిగో కృతజ్ఞతాపూర్వకవందనము" లనెను.

పురోహితు లామెమాట లన్నియు నాలకించి కత్తులు చేతఁబట్టి "యీవిషయమున జోక్యముఁ గలుగఁజేసికొనినచో నీప్రాణములు దక్క" వని ఖానుని బెదరించిరి.

అబ్బాస్‌ఖానుఁడు వారిమాటలు లెక్కసేయలేదు. అప్పు డతనికిఁ గలిగిన యుద్రేకమునకు మేరలేదు. వెంటనే తన యశ్వము నాతఁడు చితికిసమీపముగఁ దీసికొనివచ్చి తులసీబాయికి సంజ్ఞఁ జేసెను. తటాలున నామె యా వారువము నధిరోహించెను. తత్క్షణమే యాఘోటకము చెంగునదాఁటి యాజనసమూహమునుండి వారల నిరువు రనావలకుఁ దీసికొని పోయెను. వారిని బట్టుకొనుటకై యా బ్రాహ్మణులందఱు, బరువెత్తిరి. కాని క్షణములో నా తురంగ మదృశ్య మయ్యెను.

౬

శ్మశానవాటికనుండి తప్పించుకొనినపిమ్మట ఖానునకుఁ దులసీబాయికి మరల నింకొక యాటంకము గలిగెను. ఇరువురు రాజపుత్రవీరులు వీరి కెదురైరి. వారును మ్లేచ్ఛుఁడగునబ్బాస్ ఖాను నెదుర్కొని తులసీబాయిని యథావిధిగ దహన మొన రింపవలెననెడి యూహ గలవారే. సహజ బలసంపన్నుఁడగు ఖానుఁ డారసపుత్త్రులను సరకుసేయలేదు. ఖానునకు రసపుత్రులకు నొక్కింతతడవు పోరాటము జరిగెను. అబ్బాస్‌ఖానుఁడు రసపుత్రుల నవలీల నేలపైఁ బడఁ గొట్టెను.

పిమ్మట నిర్భయముగ, యథేచ్ఛగా తులసీబాయిని తనకోటకుఁ గొనిపోయెను. అప్పుడు తులసీబాయికిఁ గలిగిన సంతోషమునకు మేరలేదు. త్వరలోనే తులసీబాయి యబ్బాస్ ఖానులు వధూవరులైరి.

తులసీబాయితండ్రి పురాతన దురాచారముల రూపు మాపఁ బ్రయత్నములు సల్పుచున్నవాఁడు కావునఁ దన యేక పుత్రిక సహాగమనజ్వాలలనుండి ఖానునిచే రక్షింపఁబడి యత నిని బునర్వివాహముఁ గావించుకొనినందులకు బ్రహ్మానంద మొందెను.

మహమ్మదీయుఁడగు అబ్బాస్‌ఖానుఁడు రజపుత్రస్త్రీ యగు తులసీబాయిని సహాగమనమునుండి తప్పించివివాహమాడి నందుల కక్బరుచక్రవర్తి యత్యంతానందమొంది ఖానున్ని దన ముఖ్యసేనానిగ నొనరించుకొనెను.

క్రమముగ నబ్బాస్‌ఖానుఁ డక్బరుసార్వభౌముని మన్నన వడసి యాతనివలన ననేక జాగీరులను బొంది తుద కాతని ముఖ్యసామంతులలో నొకఁ డాయెను. తులసీబాయియు, నబ్బాస్‌ఖానుఁడును మహదానందమునఁ గాలముఁ గడపిరి.

# ధీరత్వము

## ౧

గ్రీసుదేశమం దిప్పుడు 'కొరింత్' అనఁబడు 'ఈఫిరీ' నగరమున నొకప్పుడు 'గ్లాకస్' అనురాజు పాలించుచుండెను అతనికి 'బెలరోఫన్' అను కుమారుఁడు కలఁడు. ఆతఁడు మిగుల నందమైన యువకుఁడు. దురదృష్టవంతుఁడగు 'నా బెలరోఫన్' పిన్నవయసునందే తనసోదరున కొకనికిఁ బ్రమాదవశమున మృత్యువు నాపాదింపఁ జేసెను. అందులకై యాతఁడు తన తండ్రిచే మాతృదేశమునుండి తఱిమివేయఁబడెను.

ఆదినములలోనే 'ఆర్గాస్' అనుపట్టణమును 'ప్రోయ్‌టస్' అను రా జేలుచుండెను. గ్రీకువీరులలో మహాఖ్యాతివడసిన 'పెర్సియస్' వీరున కీతఁడు మేనమామ. ఈతని రాజ్యమునకే 'గ్లాకస్' అపరాధియగు 'బెలరోఫన్' ను బంపివేసెను.

'బెలరోఫన్' ను 'ప్రోయటస్' మిక్కిలి యాదరించెను. సుకుమారుఁడును, మిగులరూపసియు నగు నాతనిపై రాజున కనురాగ మతిశయిల్లెను. రా జాతనియెడ నమితమగు ప్రేమఁ గలిగి యాతని యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులఁ గోరుచు నాతని కిసుమంతయుఁ గొదవరాకుండ నెల్లప్పుడు సర్వవిధములఁ దోడ్పడుచుండెను. సుగుణరాశియగు 'బెలరోఫన్' 'ప్రోయ్

టస్' ను తండ్రిగా నెంచుకొని యాతనియెడల నత్యంతభక్తి వినయములతో మెలఁగుచుండెను.

'ప్రోయిట్‌టస్' మిక్కిలి వృద్ధుఁడు. ఆతని భార్యయగు 'ఏన్టియా' నడిమివయసుననున్న చక్కని యువతి. ఆమె సౌందర్యాతిశయముల కామెయే మిక్కిలి గర్వపడుచుండెడిది. ఇతరులామె యౌవనరూపలావణ్యము లామెయెదుటఁ బొగడుట కంటెఁ బ్రపంచమున నితరము లెవ్వియు నామె కానందదాయకములు గావు. 'బెలరోఫన్' తనసభ కరుదెంచినప్పు డాతఁడు గూడఁ దనయందము నభినందించువారలలో నొకఁ డగు నని యామె యువ్విళ్లూరెను.

'బెలరోఫన్' యొక్క యసమానమైన చక్కఁదనమును నూత్నయౌవనమును 'ఏన్టియా' రాణి నాకర్షించినవి. రానురా నామె 'బెలరోఫన్'ను ప్రేమింపసాగెను. మోహపీడితయగునామె యాతని వియోగ మొక నిముసమైన భరింపలేకుండెను. అపారమగు నామె యనురాగము నాతఁ డావలకుఁ ద్రోసిపుచ్చెను. సుగుణగరిష్ఠుఁడగు నా రాజకుమారుని హృదయమున హీనమగు మోహమునకుఁ దావు లేదు. ఆతఁ డామెను మాతృసమానగఁ బరిగణించుకొనుచుండెను. ఆతని కామెయెడలఁ గల భక్తిగౌరవములకు మేరలేదు.

౨

ముదుసలియగు తనభర్తపై 'ఏన్టియా' యువతి కిసు-

మంతయు నిష్టము లేకుండెను. రాజపుత్రునియందలి మోహ పరవశత్వమున నామెచిత్తము చలించిపోవుటచే నామె సిగ్గును పూర్తిగ విడనాడెను. హితులు, బంధువులు, ప్రజలు నేమను కొందురోయనియైన సందేహింపలేదు. ప్రేమయావేశమునఁ దన మనోభీష్టమును 'బెలరోఫన్' నకు స్పష్టపఱచెను. స్వదేశమును వీడి పరదేశమునకుఁ బోయినచో నేభయమును లేక విచ్చలవిడిగ మహదానందమునఁ గాలముఁ గడుపవచ్చునని యామె యత నితో ననేకవిధములఁ బలికెను. ప్రయాణముకొఱకు కప్పుడే సముద్రతీరమున నావ సిద్ధపఱుపఁబడియున్నదని కూడ నామె తొందర పెట్టెను

కాని యాయువకుఁ డట్టి మాతృద్రోహమున కొడిగట్టు దుర్మార్గుఁడు కాఁడు. ఆమెవాక్యము లాతనికిఁ గర్ణకఠోరము లుగ నుండెను. అతఁడు నిశ్చేష్టుఁడైపోయెను. ఆమెభర్తయగు 'ప్రోయిట్టస్' తనయెడఁ గనఁబఱచిన యనురాగాదరము లాతని మనమున నొక్కమాఱు పొడసూపినవి. 'ఏన్టియా' తనకుఁ బెంపుడుతల్లి కావున నామెయెడల నిట్టి దుష్కృత్య మొనరిం చుటకంటె ఘోరపాతక మింకొకటి లే దని యాతఁడు నిశ్చ యించుకొనెను. వినయముతోఁ జేతులు జోడించుకొని శిరము వంచి కన్నులనుండి నీరుఁ గార్చుచు మెల్లన నిట్లనియె.

" ఓతల్లీ ! నీవాక్యములు నాహృదయముఁ బ్రద్దలు చేయుచున్నవి. నన్ను గన్నకుమారునికన్న మిన్నగఁ జూచి

కాపాడిన నీవే యిట్టి దుష్కార్య మొనరింప సాహసించినచోఁ బ్రపంచమున నింతకన్న వైపరీత్యమును మహాపాతకమును వేఱొక టుండునా? జననీ! తనయునిపైఁ గనికర ముంచి నీ విట్టి కోరిక మానుము.”

‘స్టెనిబియా’ “ప్రియుఁడా! నాకోరికలో వైపరీత్య మేమియు లేదు. నా తలిదండ్రులు బుద్ధిహీనులై నవయౌవ నాంగినగు నన్నొకవృద్ధున కిచ్చి వివాహ మొనరించిరి. నే నప్పటినుండియు సుఖమనిన నెట్టిదియో కలనైన నెఱుఁగక తుదకు జీవితముపైఁగూడ నాస రోసియుండి దైవానుగ్రహ మున నాకు నీ యోగమప్రాప్తి లభించినది. నాఁటినుండియు నా కష్టము లంతరించెననియు, నా సౌఖ్యలతలు పుష్పించె ననియుఁ దలంచి తరుణవయస్కుఁడవును సుందరాకారుఁడవు నగు నీవలన నా యౌవనము సార్థకముఁ జేసికొనఁ గలుగుదునని కొండంత యాశతో నిన్ను నాహృదయేశ్వరునిగ నెంచి నిరంతరము నీకు సపర్యలొనరించుచున్నదానను. నీవిప్పుడు నన్ననుగ్రహింపనిచో నీపాదములాన నేఁ బ్రాణముల విడుకమాన” నని యాతని పాద ములపైఁ బడెను.

‘బెలరోఫన్’ “అమ్మా! నీ విట్టి సాహసకృత్య మొన రింపకుము. నీవింతవఱ కుపన్యసించిన వాక్యములన్నియు నా కెంతయుఁ జింతఁ గలిగించుచున్నవి. పతి యెట్టివాఁడైన భరిం చుట పతివ్రతాలక్షణము. నీ వీదుర్మోహమునకుఁ జిక్కి యిహ

పరములకు వెలిగాకుము. జననీజనకులకు దూరమయి మీచేఁ బోషింపఁబడుచు మిమ్మే తల్లిదండ్రులుగా భావించి చరించు చున్న నేనీ ఘోరకృత్యమున కంగీకరింతుననెడియాశ లేశమైనఁ బెట్టుకొనకుము” అని వచించి యచ్చట నుండనొల్లక మెల్లగా నావలకుఁ బోవుచుండెను.

ఆతఁడట్లు నిరాకరించి పోవుచున్నందులకు 'ప్ట్రియా' కత్యంతకోప ముదయించెను. రోషముచే నామెముఖ మెఱ్ఱఁగఁ గందిపోయెను. ఆమెకన్నులనుండి క్రోధాగ్నిశిఖలు ప్రజ్వరిల్లినవి. “ఓరీ పిఱికిపందా! గొప్పవాఁడ ననియు, గుణవంతుఁడ ననియు, ధీరుఁడ ననియు, నీవేమో గర్వపడుచు నాప్రేమ వట్టి మూర్ఖపు మోహమనియు నేనొక కులటననియు భావించి నన్నొల్లకున్నాఁడవు. సరే పొమ్ము. 'ఆర్గాస్'నందు నీవెంతకాల మిట్లుండఁగలవో నేఁ జూచెదఁగాక!” యని యింక నేమేమియో పరుషవాక్యములాడి యామె యటనుండి లేచి వెడలిపోయెను.

'ప్ట్రియా' రోదన మొనరించుచుఁ దిన్నగాఁ దనభర్త గదిలోనికిఁబోయి యాతనికాళ్లపైఁబడి తన కన్నీటిధారలచే నాతని పాదములఁ దడిపివేసెను. రాజామెను లేవనెత్తి “నీ విచారమునకుఁ గారణ మే”మని యడిగెను. ఆమె యాతనిపై నమితమగు ప్రేమయు,గౌరవమును నటించుచు, “ప్రాణేశ్వరా! ఏమని చెప్పుటకును నా నోరాడకున్నది. మహారాజవును, న్యాయపాలనాధురంధరుఁడవు నగు నీయర్థాంగియే యితరునిచేఁ బరిభవింపఁ

బడినదని వచించుటకంటె సిగ్గుకార్యము వేఱొక టుండునా? ఓరాజా! మోహాంధుఁడై నీ రాణియొక్క పరిరంభ సౌఖ్యము వాంఛించి దుర్భావ లాడిన కుటిలునికై నీవే దండన నేర్పాటు గావించెద" వని యడిగెను.

"అట్టివాఁడు నా యభిమాన పుత్రుఁడైనను మరణార్హుఁ డని తలంపుము. నేఁడు నీకట్టి యపచార మొనరించిన దుర్మార్గుని నామము వచింపు" మని యాతఁ డనుచుండ "నా పాపాత్ముని నామము మీరే యుచ్చరించుచుండఁగ నే నిఁక వేఱుగఁ జెప్పనేల?" యని యామె పలుకుచు గిఱ్ఱునఁ దిరిగి యంతఃపురములోనికిఁ బోయి తన యభ్యంతర గృహముఁజొచ్చి తలుపు మూసికొనియెను.

'ప్రొయిటస్' ఆమె వెనువెంటనే చని తలుపుఁ దట్టెను. కాని యామె తలుపు దెఱువక నందుండి వెక్కి వెక్కి యేడువ సాగెను. రాజామె రోదన విని పెదవిఁ గఱచుకొని యేమిచేయుటకును దోఁచక మఱలివచ్చుచుఁ దన మనసునం దిట్లు యోచింపఁదొడఁగెను.

"'ఎన్టియా' వాక్యములనుబట్టిచూడఁగా 'బెలరోఫన్' ఈదుష్కార్యమున కొడిగట్టిన ట్లర్థమగుచున్నది. కాని పరసతులను మాతృభావమునఁజూచు నీ సుగుణగరిష్ఠుఁ డట్టిపనిఁ గలనేనిఁ గావింపఁ దలంపఁడని నా మనోనిశ్చయము. ఇంతకాలముఁ బెంచి పెద్దవానినిఁ గావించి వాని నిప్పుడు నిష్కారణముగఁ

జంపివై చుటకు నా మన స్సెంతమాత్ర మొప్పదు. ఇదిగాక 'బెలరోఫన్' తండ్రియగు గ్లాకస్ మిగుల బలవంతుఁడు. నే 'తని కుమారునిఁ జంపితినను వార్త వినినయంతనె యాతఁడు నాపైఁ దప్పక దండెత్తి రాకమానఁడు.

ఈవిషయమై నిజానిజములుగ నుఁగొనుటకై న్యాయాధి పతులచే విచారణఁ జేయించుదమన్న 'ఏన్టియా, తప్ప నితర సాక్షు లెవ్వరును లేకుండుటచే నామెయే న్యాయస్థానమున కరు గవలసియుండును. ఇట్టిపరిస్థితులలో దేశాచారమునుఁ గూలఁ ద్రోచి నారాణి రచ్చ కెక్కుటకంటె నవమానకరమగు విషయ మింకొకటి యుండునా ?"

ఇట్లు వితర్కించుకొని 'ప్రోయిటస్' ఒకటి రెండు రోజు లవఱకు 'బెలరోఫన్'ను పూర్వముకంటె నధికమగు ప్రేమతోఁ జూచుచు నొక పన్నుగడఁ బన్నెను.

## 3

ఆసియాఖండములోని 'లీషియా' దేశమునకు రాజు 'ఇయాబిటిస్'. 'ప్రోయిటస్'న కాతఁడు మేనమామ. వా రిరు వురకు సంపూర్ణమగు మిత్రభావ ముండెను 'బెలరోఫన్'ను 'లీషియాకుఁ' బంపివైచుట యుత్తమ మని 'ప్రోయిటస్' నిర్ధారణఁ జేసికొని యొకనాఁడు 'బెలరోఫన్' తనగదిలోనికి రప్పించి యాతనితో నిట్లనియెను.

"ధైర్యరాశివగు నో యోధుఁడా! సముద్రములదాఁటి వివిధదేశములను, వానియందలి సుందరములగు నగరములను, వీక్షించుచు మార్గమధ్యమున ధైర్యోపేతములగు ననేక కార్యములఁ గావించుచు దేశయాత్ర సలుపుట నీబోఁటి యువకులకు విధ్యుక్తధర్మము. కావున నీ వట్టి దేశయాత్ర గావింపుచు నచ్చటచ్చటి జనులకు నీ యనివార్య బాహుపరాక్రమముఁ జూపింప నీకిష్టము లేదా?" యని యడిగెను.

'బెలరోఫన్' ఉద్రేకపూరితుఁ డాయెను. ఉత్సాహముచే నాతని శరీర ముప్పొంగెను. నూత్నతేజ మాతని వదనమునఁ బొడసూపెను. ఇందులకు మొదటికారణ మాతనికి దేశాటనమునందుఁగల యభిరుచి. రెండవది 'ఆర్గాస్' పట్టణమును వీడిపోవలయునని తలంపు. ఇప్పు డాతని కీనగరమున నిసుమంతయు సౌఖ్యము లేకుండెను. తనచే నిరాకరింపఁబడిన 'ఏన్టియా' రాణి కాతనిపై నసూయ మిక్కుటమగుటచే నామె యాగ్రహాలోకనములకు దూరమైపోవుట కాతఁ డెంతయు నభిలషించుచుండెను.

"ఆజ్ఞాపించినచో నెట్టికార్యమునైన సంతోషపూర్వకముగఁ జేయుటకు సిద్ధముగ నున్నా" నని యాతఁడు రాజుతో ననెను. రాజు "'లీషియా' రాజున కొకలేఖ వ్రాసియిచ్చెదను. నీ వది కొనిపోయి యాతని కందఁజేయవలయును." అనిచెప్పి లేఖను వ్రాసి బెలరోఫన్ చేతి కిచ్చెను.

'బెలరోఫన్' స్వామికార్యనిరతుఁడును, విశ్వాసనీయుఁడును, విశాలహృదయుఁడు నగుటచే రా జొసఁగిన యుత్తరము లీషియారాజున కర్పింప వెంటనే బయల్వెడలెను. రాజాజాబునం దేమి వ్రాసెనో తెలిసికొనవలయుననెడి యూహ యాతని కిసుమంతయుఁ గలుగలేదు. ఉత్సాహపూరితుఁడగు 'బెలరోఫన్' అచిరకాలముననే లీషియాపట్టణముఁ జేరెను.

౪

లీషియారాజు బెలరోఫను నతిగౌరవమున నాదరించి స్వాగత మొసఁగెను. మహాదరమున నాతనికి విందొనర్చెను. పిమ్మట నాతనితోఁ గొన్ని ముచ్చట లాడి "బలయుతుఁడవగు నోగ్రీసుయువకుఁడా! నీరాకవలన నామందిరము పావనమయ్యెను. నీ యాగమనమునకుఁ గారణ మేమి" యని యడిగెను.

'బెలరోఫన్' తనయొద్దనున్న లేఖను రాజున కిచ్చెను. రా జద్దానిని విప్పి చూచెను. అందు వ్రాయఁబడిన విషయముల కాతఁ డచ్చెరువందెను. "ఈబెలరోఫన్ మిక్కిలి తప్పొనర్చినవాఁ డగుటచే నీతని నెట్లయినఁ జంపింపఁగోరి మీయొద్దకుఁ బంపితిని" అని యాజాబునందు వ్రాయఁబడియున్నది. మేనయల్లుఁడైన 'ప్రోయిటస్' కోరిక నెట్టులైన నెఱవేర్పవలయునని 'ఇయాబిటిస్' నిశ్చయించుకొనెను.

ఆకాలమున లీషియాదేశములోని ప్రజలు 'కిమేరా'

యను నొక బ్రహ్మరాక్షసివలన బాధింపఁబడుచుండిరి. ఆరక్కసి మిక్కిలి వికృతస్వరూపిణిగ నుండెడిది. దానిశిరసు సింహపుతల వలె నుండెను. గొఱ్ఱెశరీరమువలె దాని యొడలంతయు వెండ్రుకలతో నిండియుండెను. అది పాములవంటి కాళ్లను గలిగియుండి చూచువారి కెంతయు భయముఁ గొల్పుచుండెను. ప్రతినిశ్వాసమునకు దాని ముక్కు రంధ్రములనుండి నిప్పులు వెలిగ్రక్కుచుండెడిది. రాజారాక్షసిని జంప 'బెలరోఫను'ను నియమించెను.

'బెలరోఫన్' కిమేరాను జంపుట కమితోత్సాహమొందుచుండెను. ఆతనికిఁగల ధైర్యసాహసములును, యుక్తియు మిక్కిలి మెచ్చుకొనఁ దగినవి. రెండు సీసపుబల్లెము లాతఁడు చేతఁ దీసికొనియెను. మొలలో నొకఖడ్గ ముంచుకొనెను. తనకై నాయత్తపరుపఁబడిన శకటము నధిరోహించెను. ప్రజలు జయజయధ్వానములు సలుపఁగా నాతఁ డారక్కసి నుక్కడంప బయలు వెడలెను.

లెక్కకుమీఱిన యోధుల నెందరనో తనపొట్టఁ బెట్టుకొనిన యా క్రూరరాక్షసి నెదుర్కొనుటకై పెద్దవగు నాయుధము లేవియుఁ గైకొనకయె వెడలుచున్న రాకొమరుని సాహసమునకు జనులెల్ల రాశ్చర్యపడిరి.

బెలరోఫస్ కిమేరా నివసించుప్రదేశముఁ జేరునప్పటికి రాత్రి యయ్యెను. ఆతఁ డారాక్షసి గుహను సమీపించి గుహ

ద్వారముకడనున్న యొక రాతిబండచాటున డాఁగి యుండెను. రాత్రిభాగమం దారాక్షసి గుహయందే యుండఁగలదని యాతఁ డూహించెను.

౫

తెల్లవాఱుచుండెను. భానుఁడు తన సహస్రకిరణముల నాయడవియం దంతటను వెదచల్లుచుండెను. గుహాద్వారము నుండి వెలుతు రా కిమేరాపైఁ బడెను. అంత నది మేల్కాంచి యొడలంతయు విఱుచుకొని మెల్లఁగ నా గుహనుండి బయటికి వచ్చుచుండెను. 'బెలరోఫన్' తరుణముకొఱ కత్యంతజాగరూకతతో వేచియుండెను. గుహాద్వారమునకున్న రాతిబండ ప్రక్క నాతఁడు బోరగిల్ల పండుకొని కిమేరాను పరిశీలించుచుండెను. అది యాశిలపై నెక్కి నలుదెసలఁ బరికించుచు నో రావులించి నిప్పులు గ్రక్కుచుండెను. రాజకుమారుఁ డదియే మంచితరుణ మనుకొనెను. గుభాలున లేచి ప్రక్కనుండి తన హస్తమునందలి సీసపుబల్లెముల నా రాక్షసి నోటిలో గ్రుచ్చి తత్క్షణమే యాతఁడు వెనుకకుఁ దిరిగి రాతిప్రక్కను డాఁగుకొనెను. కిమేరా యాతనిపై లంఘించుటకుఁ బ్రయత్నించెను. కాని యాతఁ డచిరకాలముననె యొక యెత్తైనకొండపై కెక్కిపోయెను.

కోపావేశముచే నా రాక్షసి తనతోఁకతో నచ్చటిరాతి

బండల నన్నిఁటిని బిండిచేసివైచెను. మహాగ్నిశిఖలను నోటి నుండి వెలువరించెను. కాని యీ నిప్పులుగ్రక్కుటయే దాని మృత్యువునకుఁ గారణ మాయెను. నిప్పులు గ్రక్కుకొలఁది నోటిలోఁ గ్రుచ్చఁబడిన సీసపుబల్లెములు కరఁగి దాని యుదర మునఁ బ్రవేశించుటచే నది కడుపులోనిబాధచే మిక్కిలి రోదన మొనరించి కొంతవడికి నేలపైఁ బడెను. 'బెలరోఫన్' తత్క్షణమే కొండదిగి యారాక్షసిని సమీపించి మొలలోనిబాకుచే దానిని ముక్కముక్కలుగ ఖండించివైచెను.

వెంటనే యీ దుష్టరాక్షసి మృతకళేబరఖండముల నాతఁడు తన శకటముపై నిడుకొని లీషియానగరమున కరుదెంచెను. లీషియారాజును,ప్రజలును,బెలరోఫన్ కావించిన ఘనకార్యమున కచ్చెరు నందిరి. ప్రజ లా క్రూరరాక్షసి బారినుండి విముక్తులై బెలరోఫనును వేనోళ్లఁ బొగడిరి.

'లీషియా'రాజు తనప్రయత్నము నిష్ఫల మయ్యెనని మిక్కిలి వగచి 'ప్రోయిటస్' కోర్కె నెట్టులైన నెఱవేర్ప వలయు నని గట్టిదీక్షఁబూని మరల నొక టొకటిగా మూఁడు భయంకరకార్యము లొనరింప బెలరోఫనున కాజ్ఞాపించెను. ఆతఁ డొక పరికంబె నింకొకపరి ద్విగుణీకృతోత్సాహముతో నా భయంకరకార్యముల నవలీల సాధించి ప్రాణరక్షణముఁ జేసికొని ప్రజల మన్ననలకుఁ బాల్పడియెను.

తుదకు 'లీషియా'రాజుకూడ 'బెలరోఫన్' ధీరత్వమున

కద్భుత మొంది యాతని ననేకవిధముల స్తోత్రముఁ జేసి తన మేనల్లునికోర్కెఁ దీర్పవలయుననెడితలంపు మానుకొనియెను. పిమ్మటఁ గొన్నిదినములకుఁ దనకుమార్తె నాతనికొసఁగి మహా వైభవముతో వివాహముఁ గావించెను. మఱియుఁ దనరాజ్యమునం దర్ధభాగ మాతని కిచ్చి పట్టాభిషేక మొనరించెను.

ఏన్టియారాణి 'బెలరోఫన్' వలనఁ దన మనోభీష్టము నెఱవేఱనందుల కెంతయు ఖిన్నురాలై క్రమముగఁ గృశించి మరణించెను. పిమ్మట 'ప్రోయిటస్' రాజునకు యథార్థము తెలిసెను. తన పెంపుడుకుమారుఁడగు బెలరోఫనునెడలఁ దా నొనరించిన యపరాధమున కెంతయుఁ జింతించెను.

గ్రీకువీరులలో 'బెలరోఫన్' ధీరత్వమున కాదర్శక పూరుషుఁ డాయెను.



# దాస్య విమోచనము

౧

కశ్యపప్రజాపతిభార్యలైన కద్రూ వినతలు పుత్రార్థినులై చాలకాలము భర్త నారాధించిరి. దీర్ఘకాయులు, ననలతేజులు, బలయుతులునగు వేవురుకొడుకులఁ గద్రువ కోరుకొనెను. మహాభుజబలసంపన్నులును, వీరాధివీరులును, గద్రువసంతానముకంటె బలాధికులునైన సుపుత్రుల నిరువురఁ బడయ వినతకోరుకొనెను.

కశ్యపుఁడు చాలకాలము తప మాచరించి పుత్రకామేష్టిఁ జేసి తనభార్యలు కోరినయట్లఁ బ్రసాదించిన, వా రావెంటనే గర్భంబులు దాల్చిరి. అవి కొంతకాలమున కండములైన, వానిని ఘృతకుండముల నునిచి రక్షింపఁగా నైదువందలసంవత్సరములకు గద్రూగర్భజనితాండంబు లొక్కొక్కటి యవిసి యందు వేవురు నాగముఖ్యులు పుట్టిరి. భూభారము వహించు నాదిశేషుఁడును, క్షీరసాగరముఁ ద్రచ్చునెడ యోత్త్రముగానున్న వాసుకియుఁ, బరీక్షిన్నరేంద్రునిఁ దన విషాగ్నులచే భస్మముఁ గావించిన తక్షకుఁడును నీమె సంతానమే.

వినత తనగ్రుడ్డులనుండి యింకను బుత్రు లుదయింపక పోవుటచేఁ దాళఁజాలక నొకయండ మవియించెను. అందుండి యపరార్ధకాయ రహితుఁడగు ననూరుఁడు జనించి తన్నట్లు

సంపూర్ణశరీరుం గానీయక యండం బగిలించినతల్లిపై నలిగి "నీవు నీసవతి కేనూఱేండ్లు దాసివై యుండు" మని శపించి, యీ రెండవయండమునఁ బుట్టుకుమారుఁడు మహాబలపరాక్రమ సంపన్నుఁ డగుననియు నాతఁ డామె దాస్యవిమోచన మొనరింపఁ గలఁడనియుఁ జెప్పి వెడలిపోయి సప్తాశ్వునకు రథచోదకుఁ డయ్యెను. వినతయు నా రెండవయండము తనంతఁ దాన యవియు నంతవఱ కతిజాగరూకతతోఁ గాపాడుకొనుచుండెను.

కద్రూవినత లొకనాఁడు సముద్రతీరమున విహరించుచు క్షీరాబ్ధిమథించునెడ నుద్భవించిన యింద్రుని యుచ్చైశ్రవమును జూచిరి. ఆయశ్వము సంపూర్ణస్వచ్ఛముగ నున్నదని వినత పలికెను. దానివాలము నల్లగ నున్నదని కద్రువ యనెను. ఆతురంగపుచ్ఛము నల్లనిదే యయియుండినచో వినత కద్రువకు దాసియై యుండుటకును నిష్కళంకమైన దైనచోఁ గద్రువ వినతకు దాసియై యుండుటకును నొండొరులు పన్నిదములు వైచుకొనిరి. ప్రొద్దుపోవుటచే మఱునాఁడు పరీక్షించుదమని కద్రువ యన నాఁటి కిరువురు నింటికిఁ జనిరి.

కద్రువ తనకుమారులఁ జీరి తాను వినతతోఁ గావించిన పందెపుఁదెఱఁ గంతయు వారికిఁ దెలిపి యాయశ్వవాలమును నల్లగఁ జేయుమని వారి నెంతయుఁ బ్రార్థించెను. తల్లియాజ్ఞ యైనను నధర్మ మాచరింపరాదని వా రందుల కియ్యకొన రైరి. అందుల కామె కోపోద్దీపితయై "జనమేజయుం డొనరించు

యాగమున సర్పము లన్నియు దగ్ధమౌఁగాక " యని శాపం బిచ్చెను. అంతఁ గర్కోటకుఁ డనునాగేంద్రుఁడు తల్లిశాపము నకు వెఱచి యాగుఱ్ఱపుఁదోఁకకుఁ జుట్టుకొని నల్లగా వ్రేలాడు చుండెను. మఱునాఁడు సవతు లిద్ద ఱా ఘోటకమునుఁ గాంచిరి. దానివాలము నల్లగఁ గాన్పించుచుండుటచేఁ గద్రువ పందెము గెలిచెను. పాపము వినత నాఁటినుండియుఁ గద్రువకు దాసియై యూడిగము సేయుచుండెను.

౨

ఇట్లు నూఱేండ్లు గడచినపిమ్మట నొకదినమున వినత రెండవయండ మవిసి యందుండి యొక పక్షిరా జుదయించెను. ఆతనిదేహకాంతులు సూర్యకాంతులఁ దలపించుచుండెను. ఆతని రెక్కలకదలికవలనఁ గలిగినగాలికి, కులగిరులును, మహార్ణవంబు లును, కంపించి ఘూర్ణిల్లినవి. ఆ వైనతేయుఁ డొక్కపెట్టున హుమ్మని యంబరవీథి కెగసి రెక్కలు తెగనికులగిరివలెఁ గ్రిందికిఁ జనుదెంచెను. తల్లిపాదములకు సవినయముగ మ్రొక్కెను. పిమ్మట సవతితల్లియగు కద్రువకు నమస్కరించెను. ఆమెయు మహాసత్త్వసంపన్నుఁడగు సవతికొడుకును బరికించి సహింపనేరక " నీజనని నాదాసి. నీవును నాకొడుకు లేమిచెప్పిన నది యెల్ల నవశ్య మొనరించునది " యని యాజ్ఞాపించెను.

పాపమా వైనతేయుఁడు నిజజననియనుమతమునఁ గద్రువ

నియమించినపనులనెల్ల విధేయుఁడై నిర్వర్తించుచుండెను. ఆసర్పములన్నిఁటినిఁ దనభుజమున నుంచుకొని యడవులను, పర్వతములను, సర్వదిక్కులయందలి పట్టణములను, ద్రిప్పుచుండెను. ఒకనాఁ డాతఁ డా కాద్రవేయులఁ దనమూపున నునిచికొని మార్తాండమండలమువఱకు నెగసిన, నాచండకిరణుని వేడిమికిఁ దాళఁజాలక నాయురగము లెల్ల మూర్ఛనొంది క్రిందఁ బడినవి. కద్రువ యింద్రు నారాధించి యాతని యనుగ్రహమునఁ దన కొడుకులప్రాణములు రక్షించుకొనెను. అప్పటినుండియు నామె వైనతేయునిచే మఱింత తీవ్రముగఁ బనులు చేయించుకొనుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁ డాపక్షిరాజు తనజననిం జేరి,

"ఉ. ఆయతపక్షతుండహతి ♦ నక్కులశైలములెల్ల నుగ్గుగాఁ
జేయు మహాబలంబును బ్ర♦సిద్ధియునుం గల నాకు నీపనిం
బాయక ఱొమ్ము నందవడుఁ ♦ బాముల మోవను వానికిం బనుల్
సేయను నేమికారణము ♦ సెప్పుము దీనిఁ బయోరుహాననా."

అని యడిగెను. తల్లియు ననూరుశాపప్రకారంబును, గద్రువతోడిపన్నిదపుఁదెఱంగునుఁ జెప్పి, "తనయా! నీవలనఁ గదా మనదాస్యము బాసిపోఁగలదని యింతకాలము వేచియుంటి" నని పలికెను. తనవంటిపుత్రునిఁ గనియు నింకను దన తల్లి దాసియై యుండుటకు గరుడుం డెంతయు దుఃఖితుఁడై యొకనాఁ డా పాములఁ దిలకించి "మాదాస్యము బాసిపోవు

విధ మెఱింగించినచో దేవతలనైన నోడించి మీయిచ్చవచ్చిన వస్తువులఁ దీసికొనివచ్చి మీ కిచ్చెద” ననెను. వారు గరుత్మం తునిపై దయఁదలఁచి “నీవు మా కమృతముఁ దెచ్చి యిత్తు వేని నిన్నును, నీ జననినిఁగూడ దాస్యమునుండి వాపుదు” మనిరి.

అంత నా గరుటామంతుఁడు తల్లిపాలికిఁ జని తద్వృత్తాంత మంతయు నామెకుఁ దెలిపి యమృతసంగ్రహణార్థ మరిగివచ్చెద నని వినమితోత్తమాంగుఁడై నమస్కరించెను. వినత సంతోషించి కుమారు నాలింగనముఁ జేసికొనెను. ఘన తేయు, జయమును గాంచు మని హృదయ పూర్వకముగ దీవించెను.

నిర్జరవరులనోడించి యమృతముఁ దెచ్చునపుడు మిక్కిలి బలము గలుగుట కాహార మేదైనఁ బ్రసాదింపుమని యాతఁడు తల్లిని వేఁడెను. సముద్రగర్భముననున్న యనేక శత సహస్రసంఖ్యాకులైన నిషాదుల భక్షింపు మని యామె యానతిచ్చిన నాతఁడు శీఘ్రగతిం జని వారి నందఱ నొక్కపెట్టున మ్రింగెను. మఱియు నాకసమునఁ బఱతెంచి జనకుఁడైన కశ్యపునకు నమస్కరించి తా నరుగు పనియంతయుఁ జెప్పి యాతనిచే దీవనలఁ గొనెను. నిషాదఖాదనంబున నాఁకలి దీరకుండుటచేఁ దనకాహారముఁ బ్రసాదింపుమని యాతఁడు తండ్రిని వేఁడెను. శాప వశమున విభావస సుప్రతీకులను నిరుపురు కొన్ని యోజనముల

విస్తీర్ణమును యెత్తును గలిగిన గజకచ్ఛపములై పోరువారిని భక్షింపుమని యానతిచ్చెను.

గరుడుం డావెంటనే యచ్చటి కరిగి యొకకేలఁ గూర్మమును, రెండవకేల గజమును, బట్టుకొని యభ్రవీధి కెగసి రోహిణమను మహావృక్షపుశాఖపై నునిచి వానిని భక్షింప వచ్చునని తలఁచి యావిధముగ దానిపైఁ దనపాదము లుంచెను. తత్క్షణమే యాశాఖ గొప్పధ్వనితో విఱిగిపోయెను. దానిపైఁ గల ఖగసమూహములు భయసంభ్రమములతోఁ బికాపికలయి పాఱినవి. ఆకొమ్మ నవలంబించి తలక్రిందుగ వ్రేలాడుచుఁ దప మాచరించు వాలఖిల్యాదిమహామునుల తపస్సునకు భంగ మయ్యెనేని దానివలన మహాపాతకము గలుగునని యూహించి యా ఖగనాథుఁ డా శాఖను దన ముక్కునఁ గఱచుకొని తిరిగి తండ్రియొద్దకుఁ బోయి నమస్కరించెను. కశ్యపుఁ డామునిశ్రేష్ఠుల నందఱను వేఱొండుశాఖలకుఁ బొమ్మని వేఁడుకొనెను. వారును గరుడుని దీవించి వెడలిరి.

ఖగపతి తండ్రియనుమతి నా వృక్షశాఖను నిర్మానుష్యమగు హిమవత్పర్వతమున విడిచి గజకచ్ఛపముల నారగించి మహాసత్త్వసంపన్నుఁడై దేవలోకమున కెగయఁ బ్రయత్నించి పక్షములు గదలించెను. అంత వృక్షము లాతనిపై బుష్పముల గురిసి జయమును సూచించినవి.

## 3

వైనతేయుఁ డాకాశవీథి నెగసెను. నాకలోకము దద్దరిల్లెను. దిక్కులన్నియుఁ గంపించెను. దిక్పాలు రెల్లరు భయకంపితులైరి. దిగ్గజముల మదంబు లుడిగెను వజ్రాయుధము ధారలు మొక్కవోయెను. అమరనాథుని సభలో నగ్నికణములు రాలెను. ఇట్టి మహోత్పాతములకుఁ గారణ మేమని యా సురేశ్వరుఁ డడుగ బృహస్పతి ఖగపతివృత్తాంతమంతయుఁ దెలిపెను.

ఇంద్రుఁడు తత్క్షణమ యమృతరక్షకుల రావించెను. "అప్రమత్తులరై యమృతరక్షణ మొనరింపుఁ" డని యాతఁ డానతిచ్చెను. అత్యంత బలశాలురును, బహువిధశస్త్రాస్త్రపాణులునగు పలువురు మహావీరు లా యమృతము నతిప్రయత్నమున రక్షించుచుండిరి.

పక్షీంద్రుని రెక్కలగాలికి నాకనమందలి మేఘములు భిన్నభిన్నములై చెదరిపోయెను. కల్పాంతమందలి యగ్నికీలల వలెఁ బ్రకాశించు పక్షములుగల గరుడుం డమృతాయతనముఁ బ్రవేశింప రక్షకు లొక్కుమ్మడి నాతని నెదిర్చిరి. కొందరు శస్త్రముల వైచిరి. కొంద రస్త్రములఁ బ్రయోగించిరి. మఱి కొందరు ఖడ్గములఁ బొడిచిరి. ఖగనాథుఁడు తనపక్షములఁ గదల్చి నిర్జరలోకమంతయు ధూళిచేఁ గప్పివుచ్చి యమరవరులనందఱ నంధీభూతులఁ జేసెను. సంక్రందనునిపనుపునఁ బ్రభంజనుఁ డాధూళినిఁ జెదరఁగొట్టెను.

సురసిద్ధసాధ్యగంధర్వప్రముఖు లెల్లరు నాతనితోఁ బోరి గర్వ ముడిగి దేహములనుండి రక్తధారలు స్రవింప సురపతికడ కేఁగిరి. వరుణాగ్నియమప్రభృతులు చెల్లాచెదరై పోయిరి. ఇటు లాయమరశ్రేష్ఠుల నెల్లర నుక్కడించి మహాటోపమున నా పతఁగేంద్రుఁ డమృతశాలఁ బ్రవేశించెను.

అమృతముఁ జుట్టి మహోజ్జ్వలముగ నాకసమంటు దుర్వారానలశిఖలఁ గని నదీజలములనెల్లఁ దనపుక్కిట నిముడ్చు కొని యాచిచ్చును రెప్పపాటులోఁ బక్షిరా జార్పివేసెను. అత్యంతతీక్ష్ణధారమై యెల్లప్పుడు నొక్కపెట్టునఁ దిరుగు యంత్ర చక్రమును సూక్ష్మదేహముతోఁ బరిక్రమించెను. తమదృష్టుల నుండి నిరంతరము విషాగ్నుల వెదజల్లు కూ్రరసర్పములు రెం డాచక్రముక్రింద మహాతేజమున నమృతమును రక్షించుచుండెను. గరుడుఁ డాపన్నగములకంట బూడిదఁ జల్లి శిరములఁ ద్రొక్కి యుక్కడంచెను.

గరుత్మంతుఁ డిట్లు పరాక్రమము మెఱయ నమృతముం గైకొని యంబరమున కెగసెను. మహాజవమున నమరులనెల్ల జయించి చేకొనిన సర్వోత్కృష్టమైన యమృతమును దా నాస్వాదింపక యకాల్యమున నురగులకుఁ దీసికొనిపోవు విహ గేంద్రునకు శ్రీమన్నారాయణుఁడు ప్రత్యక్షమై యాతని సద్భావమునకు మెచ్చి వరముఁ గోరుకొమ్మనినఁ బరమభక్తా గ్రేసరుఁడగు నా పక్షీంద్రుఁడు "దేవా! అమృతముఁ గ్రోల

కమె నాకు జరామరణములు లేకుండుఁగాక ! నిన్నే సర్వదా నేను గొల్చుచుండెదనుగాక !" యని వేఁడుకొనెను.

శ్రీమహావిష్ణువు ప్రసన్నుఁడై "నీకోర్కె నెఱవేఱుఁగాక ! నాకు వాహనమును, ధ్వజమును నయ్యెదవుగాక!" యని ప్రసాదించి యంతర్హితుఁ డయ్యెను.

ఇంద్రుఁడు మహోద్రేకమునఁ దన వజ్రాయుధము నెత్తి గరుడునిపై వైచెను. అగ్నికణముల రాల్చుచు మహాభయంకరముగఁ దాఁక నరుదెంచు నా కులిశముఁ గాంచి గరుడుఁడు నవ్వుచు నిట్లనియె. "ముల్లోకములకురాజైన దేవేంద్రుని యాయుధమ వగుటచే నిన్నవమానింపరాదు. కావున నా పక్షముపై నొక యెఱకఁ ద్రుంతువుగాక" యనెను.

సకల భూతసంఘము లాతనిపర్ణముల సుస్థిరత్వమునకు మెచ్చి సుపర్ణుఁడని స్తోత్ర మొనరించినవి. అమరేంద్రుఁడు విహగేంద్రునిమహాత్మ్యమున కచ్చెరు వందెను.

స్నేహభావంబున నాపక్షీంద్రునితో మఘవుం డిట్లనియె. "విహగోత్తమా ! విష్ణుదేవునిప్రసాదమున నీవమరుఁడ వైతివి. అమృతము నొరుల కొసఁగినచో నపాయము వాటిల్లఁ గలదు. కావున నీవు దానిని దిరుగ మాకుఁ బ్రసాదింతువేని నీయభిమతము నెఱవేర్తు" ననెను. ఖగనాథుఁడు తన వృత్తాంతమంతయు నెఱిఁగించి యమృత మురగులపాలౌకుండఁ జేయఁగల యుపాయముఁ జెప్పెను.

పిమ్మట వైనతేయుఁ డమృతముఁ గాద్రవేయులయొద్దకుఁ దీసికొనివచ్చి దానినిఁ బచ్చనిదర్భలపై నునిచి వారితో "నురగులారా! ఇదిగో మీరు కోరినయట్లమృతముఁ దెచ్చి మీ కిచ్చితిని. నాయొక్కయు నాజననియొక్కయు దాస్యము నేఁటితోఁ బాసిపోయెను. పంచభూతములు సాక్షిగ మేము విముక్తుల మైతిమి. మీరందఱు స్నానం బాచరించివచ్చి దీనినారగింపుఁ" డని చెప్పి తనతల్లిని వీపుపై నెక్కించుకొని నిజేచ్ఛం జనెను.

గరుత్మంతునివెంట నరుదెంచినయింద్రుం డాసర్పములు స్నానం బొనరించి వచ్చుటకుమున్నే యమృతముం గొని త్రిదివమ్మున కరిగి యథాస్థానమున నద్దాని నునిచెను. నాగులు కృతస్నాతులై యరుదెంచి యమృతముం గానక నది యుంచఁబడినస్థలమున దర్భలు నాకిన వానినాలుకలు రెండుగాఁ జీలికలయ్యెను. అమృత ముంచఁబడుట చే దర్భలు పవిత్రము లయ్యెను.

మహేంద్రుఁడు పక్షీంద్రునిప్రభావమునకు మెచ్చి "యాతని కపకార మొనరించిన యురగసముదాయంబెల్ల నతని కశన మయ్యెడుఁగాక" యని దీవించెను.

# సత్యము.

౧

శివుఁడు మహాదేవుఁడు. తమోగుణ ప్రధానుఁడు. ఇచ్ఛావిహారి. సర్వప్రపంచములయందలి సృష్టివైచిత్ర్యమునుఁ బ్రకృతి తత్త్వమునుఁ బరికించి యానందపరవశత్వమునఁ దాండవనృత్యమాడు నటరాజు. తననే దైవముగ నమ్మి తన పాణిని గ్రహించిన సహధర్మచారిణికిఁ దనశరీరమున నర్ధభాగ మిచ్చిన ప్రణయమూర్తి. కాలాంతకుఁడై మహాగ్నినిఁ బ్రజ్వరిల్లఁజేసి భువనములఁ గాల్చి భీభత్సుఁడై వెలుఁగు ప్రళయకాలరుద్రమూర్తి. ప్రపంచములఁ గాల్చు హాలాహలాగ్నిని లోకహితార్థమై తన కంఠమునందు దాఁచుకొనిన దయాస్వరూపుఁడు. భక్తుని సంతృప్తునిగఁ జేయుటకు భరింపరాని వియద్గంగాప్రవాహమును దన జటాజూటమునం దిఱికించుకొని వసుంధరను సస్యశ్యామలగఁ జేసి భగీరథుని ప్రయత్నముఁ గొనసాగించిన దయాశాలి.

త్రిపురసంహారకుఁడును, దక్షాధ్వరధ్వంసియుఁ గుసుమశరమథనుండును, పన్నగభూషణుండును, భిక్షాటనపరుండును, దిగంబరియు, మహానటుండు నగు నిటలాక్షుని మహత్త్వముఁ దెలిసికొనుట యెవరితరము ?

పూర్వ మొకప్పుడు "మహాదేవుని గొప్పఁదనము నాకుఁ దెలియును నాకుఁ దెలియు" నని యజ్ఞనాభుఁడును సరసిజసంభవుండును, బంతములాడుకొనిరి.

శంకరుఁడు లీలావినోది. బ్రహ్మవిష్ణుల వివాదసమయమున వారిరువుర మధ్యమున నిఖిలభువనపర్యంతము విజృంభించి, యుజ్జ్వలజ్వాలానికాయములు వెదచల్ల ననలస్తంభదివ్యలింగాకారంబున నావిర్భవించెను. పాతాళమునుండి భూనభోంతరాళములలోనికిఁ బెరిగిపోయిన భర్గునిమహిమకు వా రచ్చెరువంది యాతనిని వేఁడుకొనిరి. శశిధరుఁడు ప్రసన్నుఁడై తన లింగము తుది మొదలుఁ దెలిసికొనిరండని బ్రహ్మవిష్ణుల నాజ్ఞాపించెను. అంతట విరించి లింగోపరిభాగముఁ గనిపెట్టుటకై హంసతేజీ నెక్కి యాకసముపైకిఁ బోయెను. విష్ణుమూర్తి కిటినెక్కి పాతాళంబున కరిగెను.

౨

వార లట్లతిప్రయాసమునఁ జనిచని తమకుఁ గావలసిన శిరస్సునకుఁగాని, పాదములకుఁగాని దరి గానరైరి. పుండరీకాక్షునికిటి యలసిపోయెను. పాతాళలోకము క్రిందికిఁగూడ జాఱెను. మహాదేవుని యాదిపీఠముఁ దెలిసికొన విష్ణుదేవుఁడలసిపోయెను. హతాశుఁడై పైకరుదెంచెను.

బ్రహ్మయు రాయంచపైనెక్కి యాకాశమండలము దాఁటెను. నభోంతరాళము లన్నియు దాఁటెను. నిఖిలభువనములును దాఁటెను. మరాళరాజమునకు రెక్కల పట్లు తప్పిపోవుచుండెను. చతుర్ముఖుఁడు తన యాననములఁ బైకెత్తి చూచెను.

ఆ సమయమున శివలింగము ననుసరించి కేతకీసుమ మొక్కటి క్రిందికి జాఱిపడుచుండెను. అరవిందనందనుఁ డద్దా నిని దన హస్తమునఁ బట్టుకొని దానివృత్తాంత మడిగెను. తాను శివలింగమునకుఁ బూజసేయఁబడిన దాన ననియు శర్వుని శిర స్సునుండి క్రిందఁబడుచుంటి ననియుఁ గేతకీసుమము చెప్పెను. ఆ శిర స్సెంతదూరమున నున్నదనియు నీ వెంతకాలమునుండి ప్రయాణము సేయుచుంటివనియు నజుఁ డడుగఁగా నదియెంత పర్యంత మాక్రమించినదియుఁ దాను వచింపలేననియు నెన్ని యుగములనుండి జాఱుచున్నదియు లెక్కకు మించెననియు నా మొగలిపువ్వు వచించెను. నీ వాతని శిరస్సునుండి వచ్చు చున్న విషయ మంద ఱెఱిఁగినదే కావున నేనుఁగూడ శివలింగ ముతుది జూచితినని శివునియెదుట సాక్ష్య మిమ్మని బ్రహ్మ కేతకీసుమమును బ్రార్థించెను.

పాప మాపుష్పము శంభునెదుట నసత్యమాడుట కియ్య కొనననని వినయముగఁ జెప్పెను. ధాత కోపోద్రేకముతో "నిన్ను నేన సృజించితి. నీ విక్కార్యము నాకొనరింపనిచో నీ కితర సుమములవలె గౌరవప్రపత్తి లేకుండఁ జేసెద" నని భయపెట్టెను. ఏమి చేయుటకునుఁదోఁచక నా ప్రసూన మం దుల కియ్యకొనెను.

పిమ్మట వారిజాసనుఁడు మఱలివచ్చుచు స్వర్గమున కేఁగి కామధేనువుం గాంచి తాను శివలింగము తుదిఁ జూచితి నని సాక్ష్య మిమ్మనియు నట్లీయనిచో శపింతుననియుఁ బలుక నెట్ట కేల కది యుందుల కియ్యకొనెను.

## 3

మురారి, మన్మథారిని దర్శించి "మహాదేవశంభూ; నిర్జితకాముండవును, తాండవలోలుఁడవు నగు నిన్నుఁ దెలియ నెవ్వరితరము? అభవుఁడవగు నీయాదిసీమము నే గ్రహింపఁజాలకపోతిని. క్షమింపు" మని వేఁడుకొనెను.

విరించి యేతెంచి "శంకరా! నిరాతంకముగా నేను నీయంతముఁ జూచివచ్చితి" నని చెప్పి యందులకు సాక్ష్యములుగా, కేతకీపుష్పమును, కామధేనువును జూపించెను. అసత్య వాక్యమునకు శివుఁడు మహోగ్రుఁడై మొగలిపూవు శివపూజ కనర్హమైనది యగుఁగాక యనియుఁ గోవవునని తలయూఁచి వెనుకకుఁ దిరిగి లేదని తోఁక నాడించుటచే గోవు పృష్ట భాగమే దర్శనీయ మనియు ముఖము పాపాకర మనియు శపించెను.

మఱియు నిట్టి నీచత్వమున కొడఁబడి యసత్యమాడిన బ్రహ్మకు భూలోకమునఁ బూజా పునస్కారంబులు లేకుండుఁ గాక యని యాశంకరుఁడు శపించెను.

కేశవుని సత్యనిష్ఠతకు మహేశ్వరుఁ డంబరి లోకములో నాతనిఁ బెక్కురూపముల ననేకులు పూజసేయునట్లుతనికి వర మిచ్చెను.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము. 1936.